# విస్మృత స్వరాలు

## (గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)

గౌరవ్

ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం

తెలంగాణ - ఆంధ్రప్రదేశ్

# విస్మృత స్వరాలు (గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)

గౌరవ్

ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం

లోక్‌సేవక్‌సంఘ్ ఆధ్వర్యంలో

ప్రచురణ కాలం : 2015

ప్రతిపాదిత చందా : ₹ 25/-

కాపీలకు : 9441089829

వివరాలకు : gouravmeka@gmail.com



# విజ్ఞప్తి

వ్యక్తులకు విశిష్ట ప్రాముఖ్యతనిస్తూ అందర్నీ కూడగట్టి ఒక్క దరికి చేర్చాలనే భావనకంటే, మరుగున పడ్డ భావాలకు ప్రాధాన్యత నిచ్చి యువతలో సామాజిక స్పృహను పెంపొందించే సంకల్పమే స్ఫూర్తిదాయకమనే భావన నాది. కాబట్టి ఈ పుస్తకంలో చేర్చాల్సిన అభ్యర్థులు ఇంకా కొంతమంది ఉన్నంతలో వారి కృషి పట్ల గౌరవ భావమున్నప్పటికీ నాకున్న పరిమితుల రీత్యా ప్రస్తుతం ఇంతమందిని మాత్రమే ఎంచుకోవడం జరిగిందేగాని, దానర్థం ఇతరుల్ని మరుగున పరచాలనే దురుద్దేశం మాత్రం కాదని తెలియజేసుకుంటూ ఇంతకంటే సునిశిత ప్రతిభాపాటవాలతో కూడిన ప్రజాతంత్ర ప్రయత్నాలు భవిష్యత్తులో మరిన్ని జరగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

- గౌరవ్



# అంకితం

ఆచరణవాద అహింసావేత్త

ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ దివ్యస్మృతికి...

# కృతజ్ఞతలు

రావెల సోమయ్యగారు (హైదరాబాద్), మోత్కూరి అరుణ్‌కుమార్‌గారు (విజయవాడ), లోక్‌నాథ్ (హైదరాబాద్); నశీర్ అహ్మద్‌గారు (ఉండవిల్లి), ఈదర గోపీచంద్‌గారు (నరసరావుపేట); టి. రవిచంద్‌గారు (బాపట్ల), మలయశ్రీగారు (కరీంనగర్), నటరాజ్‌గారు (విశాఖపట్నం), డా॥ శ్రీనివాస్‌గారు (ఏలూరు), రాధాకృష్ణమూర్తిగారు (అనంతపురం), కృష్ణాబాయిగారు (విశాఖపట్నం).

* * *

"By showing me injustice he taught me to love justice. By teaching me what pain and humiliation were all about, he awakened my heart to mercy. Through these hardships I learned hard lessons. Fight against prejudice, battle the opressors, support the underdog. Question authority, shake up the system, never be discouraged by hard times and hard people. Embrace those who are placed last, to whom even bottom looks like up... I will never be discouraged. Even thorns and thistles can teach you something, and lead to success."

**– Roy Black**

# ఇందులో....





# నా మాట...!

సమాజంలోని మొట్టమొదటి వ్యక్తీ చిట్ట చివరి వ్యక్తీ సమానంగా ఉన్నప్పుడే ప్రజాస్వామ్యం ప్రవర్థిల్లుతుందనేది యదార్థం. అనేక కారణాల వల్ల ఆ ఆదర్శం అంతకంతకూ దూరమయ్యేమాట నిజమే. ఐనప్పటికీ, చరిత్రలో ఆ లక్ష్య సాధనే ధ్యేయంగా కొనసాగిన నిర్మాణాత్మక విధానాల పర్వం తర్వాతితరాలకు స్ఫూర్తి నందిస్తూనే ఉంటుంది. దేశ ప్రజానీకాన్ని కదిలించిన పాత్ర గాంధేయవాదానికుంది. వ్యక్తిగతంగా గాంధీలోని లోపాలెన్నున్నప్పటికీ వ్యవహారికంగా ఆనాడు ఆయన తీసుకున్న నిర్ణయాలూ, చూపించిన దక్షతా అందరికీ అనుసరణీయమే. ముఖ్యంగా, ప్రకృతి వనరుల్ని విచ్చలవిడిగా కరిగిస్తూ అక్కర్లేని వస్తుసముదాయాన్ని వీలైనంత ఎక్కువ పరిమాణంలో హద్దుమీరి వినియోగించడమే అత్యాధునిక నాగరికతగా భావిస్తున్న ప్రస్తుత వ్యవస్థకు గాంధీమార్గం ఎంతోకొంత ఉపకరిస్తుందన్న ఆలోచనే ఈ కార్యక్రమాల్ని తీసుకోడానికి నడిపించిన నేపథ్యం. నేను గాంధేయవాదిని కాను, ఎన్నడూ అలా లేను. ఐతే, గాంధీని గుడ్డిగా ఆరాధించడం, లేపోతే పిచ్చిగా అసహ్యించుకోడమే కాని ఆయన అస్తిత్వం నుంచి జనించిన చైతన్యాన్ని ఉన్నదున్నట్లుగా గుర్తించి చారిత్రకంగా దానిని మదింపు వేసిన సంఘటనలు అరుదు. ఆయన బోసినవ్వుని కరెన్సీనోట్లమీదా, కాలవొడ్డు విగ్రహాల మీదా, క్లాసు పుస్తకాల్లోనూ చూసి తోచినట్లు ఊహించుకోవడమే కాని ఆయన పాటించిన విలువల వెలుగులో ఈనాటి సమాజాన్ని దర్శించి తరించడం తరాల వల్ల కావట్లేదు. గాంధీజీ లోపాల్నీ, ద్రోహాల్నీ వెతకడానికి సోకాల్డ్ సోషలిస్టులూ, కమ్యూనిస్టులూ, అంబేద్కరిస్టులూ యింకా చాలామంది నిక్కచ్చిగా చూపే ఆసక్తిలో వెయ్యోవంతైనా ఆయన ఆలోచనల్నీ ఆచరణనీ అర్థం చేసుకోవడంలో చూపించి వుంటే అసలాయన గురించి ఏమీ తెలీకుండానే అవాంఛనీయమైన ద్వేషాన్ని ఆయనపట్ల పెంచుకునే వాతావరణం తలెత్తేది కాదేమో. ఆయనేం మానవాతీతుడు కాడు. బొత్తిగా తప్పులనేవే చేయకుండా వుండడానికి భగవత్ స్వరూపుడూ కాడు. అయినా వ్యక్తుల్ని అర్థం చేసుకోడానికి బదులు అపార్థం చేసుకోడానికే అత్యుత్సాహం చూపిస్తోన్న వ్యవస్థలో సత్యాన్వేషణ పద్ధతిని శాస్త్రీయంగా అంచనావేసే ప్రతి క్రమానికీ నిష్పక్షపాత దృక్పధమవసరం. అలా కాకపోతే సంకుచిత ప్రయోజనాల కోసం విశాల వైఖరుల్ని వ్యతిరేకించవల్సి

వస్తుంది. భగత్‌సింగ్ ఉరితీత విషయం మొదలుకుని నేతాజీ ఎన్నికవరకూ, బీహార్ భూకంపం నుండి ఢిల్లీ ఘర్షణల దాకా, పూనాపేక్ట్ నుంచీ పాకిస్తాన్ యాక్ట్ దాకా కచ్చితంగా గాంధీని ప్రశ్నించాల్సిన, నిలదీయాల్సిన సందర్భాలు చాలానే ఉన్నాయి. కానీ, అందుకు సకారణ వ్యతిరేకతేకాని అకారణ ద్వేషం అవసరం లేదు. వామపక్ష ఉద్యమం మొదలుకుని దళిత బహుజనోద్యమం దాకా ఈరోజు గాంధీపై వెదజల్లుతున్న ద్వేషాగ్నికి ఆయన అర్హుడు కనీసం అంతస్థాయిలో అవడేమో ఆలోచించడ మవసరం. యాంత్రీకరణ పేరిట ప్రాకృతిక హింసకు పాల్పడుతున్న ఆధునిక సమాజంలో సత్యం పేరిట మానవీయ అహింసకు తనదైన శైలిలో రూపకల్పనచేసిన గాంధేయవాద విలువల్ని నూతన వైఖరిగల ప్రత్యామ్నాయోద్యమకారులంతా అధ్యయనం చేయాల్సిన అవసరముంది. అనేక విషయాల్లో విబేధించి తీరాల్సిన అవసరమూ ఉంది. ఐతే, గాంధీని ఒకరకం కళ్ళద్దాల్లోంచి మాత్రమే చూడ్డానికి అలవాటు పడ్డవారికి ఆయన్ని మరోకోణం నుంచి చూసేందుకు ఇష్టముండదు. సత్యాన్వేషణలో వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు స్థానం లేదు కాన గాంధేయవాదులుగా ఉభయ తెలుగు రాష్ట్రాల్లో నున్న కొద్దిమంది ఇంటర్వ్యూల్ని ఈ రకంగా మీముందుకు తేవడం జరుగుతోంది. ఇదీ సమగ్రం కాదు, అలాగని బొత్తిగా అసమగ్రమూ కాదు. వీలున్నంతమేర విషయసేకరణ చేసి అందర్నీ స్వయంగా కల్సి రాసుకున్న నోట్సుకు కల్పించిన తుదిరూపమిది. అనారోగ్యం కారణంగా కె.ఎస్. తిలక్, సామ్రాజ్యం గార్లాంటి ఉద్దండుల్ని ఇంటర్వ్యూలంటూ బాధపెట్టలేదు. అనుబంధ యింటర్వ్యూలు సైతం అసందర్భాలు కావనే అనుకుంటున్నాను. అలాగే రాయలసీమ ప్రాంతంలో కాంటాక్ట్స్ దొరకనందున అక్కడెవరూ ఉన్నట్లు సమాచారం రాలేదు. ఈ కార్యక్రమంలో సహకరించిన ఆత్మీయులందరికీ పేరుపేరునా హృదయ పూర్వక కృతజ్ఞతాభినందనలు తెలుపుకుంటూ ఈ గ్రంథంలో ఇంకెవర్నయినా కలపాల్సిందని అనిపిస్తే మలిముద్రణలో ఆ ప్రయత్నం కూడా చేస్తానని సవినయంగా విన్నవించుకుంటూ, నాకున్న పరిమితుల రీత్యా కొద్దిమంది ముఖ్యుల్ని మాత్రమే ఇందులో తీసుకోవడం జరిగింది కాన దానర్థం ఇతరుల ప్రాధాన్యతను విస్మరించడం కాదని సగౌరవంగా తెలియజేస్తూ, మరుగునపడ్డ ప్రత్యామ్నాయ భావాలకు స్థానం కల్పించే వుద్దేశంతో స్వచ్ఛందంగా చేసిన ఈ పనికి పనికిమాలిన రంగులద్దే పని దయచేసి ఎవరూ పెట్టుకోవద్దని విజ్ఞప్తి చేస్తూ పుస్తకంలోకి మిమ్మల్ని సాదరంగా ఆహ్వానిస్తున్నాను.

- గౌరవ్

గాంధేయ మార్గావలంబికులు

# రావూరి అర్జునరావుగారి

## (విజయవాడ) ఇంటర్వ్యూ



**ప్ర. ముందుగా మీ బాల్యం, కుటుంబ వివరాలు చెప్పండి?**

జ. నేను గుడివాడ తాలూకా వానపాముల గ్రామంలో వొక వ్యవసాయ కుటుంబంలో జన్మించాను. ఫోర్త్‌ఫారమ్ దాకా చదివాను. అప్పట్లో స్వాతంత్ర్యోద్యమ భావాలు గ్రామాల్లో వెల్లివిరిసేవి. యువకుల్లో ఉడుకురక్తం ఊరుకునేది కాదు. ఆ క్రమంలో బ్రిటిష్ ప్రభుత్వానికి బుద్ధి చెప్పదలచి రైలుపట్టాలు పీకే ఆందోళన చేపట్టాం. అప్పుడే నన్నెరస్టు చేసి బళ్ళారి తాలూకా ఆలీపురం కేంపు జైలులో కొంతకాలం శిక్షవేసి వుంచారు.

**ప్ర. గోరాగార్తో మీ పరిచయమెలా అయింది?**

జ. మా ప్రాంతంలో టంగుటూరి ప్రకాశంగారు, పట్టాభిసీతారామయ్యగారు, గోరాగార్ల ప్రభావం యువకులపై వుండేది. అప్పట్లో గోరాగారు మచిలీపట్నం హిందూ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తుండేవారు. ఉద్యోగానికి రాజీనామా చేయడంతో మున్నె అంజయ్యగారు ఆయనచేత గ్రామాల్లోని యువతకి రాజకీయ చైతన్య శిక్షణా తరగతులు చెప్పించేవారు. ఆ విద్యార్థుల్లో నేనొకడిని. ఆ సాన్నిహిత్యం పెరిగి గోరాగారికి అల్లుడైపోయాను.

**ప్ర. మీ వివాహమెలా జరిగింది?**

జ. కులతత్వానికి వ్యతిరేకంగా గాంధీగారు పోరాటం చేయదలచి వర్ణాంతర వివాహాలకు సిద్ధపడే జంటలకు తన ఆశ్రమంలోనే పెళ్ళి చేస్తానని ప్రకటించారు. అప్పుడు గోరాగారు తన పెద్దమ్మాయి మనోరమకీ నాకూ వివాహం చేయదల్చి గాంధీగారి సలహా నిమిత్తం లేఖరాస్తే, ఇంత పిన్న వయసులో పెళ్ళికి తొందరేమొచ్చిందని వో 2 సం॥రాలు ఆగమని మనోరమని చదువుకోసం వేరేచోటికి పంపి నన్ను మాత్రం ఆయనతో సేవాగ్రాం తీసుకెళ్ళారు.

**ప్ర. సేవాగ్రాంలో ఎంతకాలమున్నారు, ఏం చేసారు?**

జ. 2 సం॥రాలక్కడున్నాను. రాట్నం వడకటం, సఫాయి పనీచేసేవాడ్ని. అనంతర కాలంలో గాంధీ మహాత్ముడు హత్యకు గురై చనిపోవడంతో **1948**, మార్చి **13**న నెహ్రూగారి ఆధ్వర్యంలో మా పెళ్ళి జరిగింది.

**ప్ర. అప్పట్లో, ఇంకేం కార్యక్రమాలు చేసారు?**

జ. వయోజనవిద్యా, ఖద్దరు ప్రచారం, సహపంక్తి భోజనాలు, మొదలైనవి చేసాం. హరిజన సేవాసంఘం తరఫున కొంతకాలం విద్యార్థులకు హాస్టల్‌పెట్టి వారి ఆలనా - పాలనా చూసాం. దోనె తాతయ్య, దాసు రామస్వామి, అప్పికట్ల జోసఫ్, అన్నె అంజయ్య మొదలగువారెంతో సహకరించేవారు.

**ప్ర. గాంధీజీకి వ్యతిరేకంగా రకరకాల విమర్శలున్నాయిగా వాటిపై.....?**

జ. మాటల్లో ఆయన్ని ఎంతగా విమర్శించిన వారైనా ఆయన మార్గం ముందు మౌనంగా తలొంచుకుని చూడక తప్పలేదు. నాటికీ-నేటికీ ప్రపంచాన్ని మార్చే ఏకైక మానవీయ ప్రత్యామ్నాయం గాంధీ మార్గమే.

**ప్ర. నాటికీ-నేటికీ మీకు వ్యవస్థలో కనిపిస్తున్న మార్పులేమిటి?**

జ. ఆ రోజు త్యాగం వుండేది. ఈరోజు స్వార్థమే పరమావధి అయిపోయింది. స్వాతంత్ర్యోద్యమం ప్రతి మనిషినీ మరో మనిషి గురించి ఆలోచింపజేసింది. అందుకే అదో అపూర్వ చరిత్ర. నేడు అది మసకబారుతోంది. స్వాతంత్ర్యం స్థానంలో స్వార్థం పెరిగి యువత పెడదోవ పడుతోంది.

**ప్ర. ఈ పరిస్థితి ఎలా మెరుగుపడుతుంది?**

జ. మార్పు అనివార్యం, అందుకు గాంధీ మార్గమే శరణ్యం.

**ప్ర. చివరగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. నాకిప్పుడు 99 సం॥రాలు. పళ్ళూడలేదు, కళ్ళు కనబడ్డం మానలేదు. చిన్న వయసులోనే అనారోగ్యాలతో బాధపడుతోన్నవార్ని చూస్తే జాలేస్తుంది. సారం గల ఆహారాన్ని సమతుల్యంగా, సమయానుకూలంగా తీసుకోకుండా వుండటమే ఇందుకు కారణం. యువత మారాలి. స్వార్థాన్ని వీడి త్యాగబుద్ధిని అలవర్చుకుని దేశసేవకై ముందుకు రావాలి.

అచంచల సోషలిస్టూ - గాంధేయవాది

# కె.ఎస్. శాస్త్రిగారి

## (విశాఖపట్నం) ఇంటర్వ్యూ



**ప్ర. మీ బాల్యం, చదువు గురించి చెప్పండి?**

జ. తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురంలో పుట్టాను. రాజమండ్రిలో చదివాను. విజయనగరంలో చదూతుండగానే క్విట్ ఇండియా ఉద్యమం ఉధృతంగా సాగుతోంది. అందులో అరెస్టయి జైలుకెళ్ళాను. అలా చదువు అటకెక్కింది.

**ప్ర. అంత చిన్నతనంలోనే అభ్యుదయ భావాలెలా వచ్చాయి?**

జ. మా అక్క వెంకటరమణమ్మా, బావ మద్దూరి అన్నపూర్ణయ్యగారు గొప్ప దేశభక్తులు. వారి ప్రభావంతో తొమ్మిదో ఏటనే స్వాతంత్ర్యోద్యమంలోకి దూకి పెద్దాపురం మార్కెట్టులో నిలబడి బట్టలు కొనడానికొచ్చేవాళ్ళ కాళ్ళు పట్టుకుని విదేశీ వస్త్ర బహిష్కరణ గాంధీ కావించమన్నాడని చెప్పేవాడ్ని. ముద్దు ముద్దు మాటలు చూసి తినుబండారాలిప్పించేవారు. ఇదేదో బాగానే వుందనుకున్నా. ఇంతలో కాకినాడ బాంబు కేసు ముద్దాయి ప్రతివాది భయంకరాచారిగారు నన్నెత్తుకుని సామర్లకోట తీసుకెళ్ళి అప్పటికప్పుడు ఖద్దరు కుట్టించిచ్చి కల్లు దుకాణాలవద్ద ఒంటరిగా పికెటింగ్ చేయమన్నారు. చేసి తన్నులుతిని కూడా ధైర్యంగా నిలబడ్డాను.

**ప్ర. ఇంకెవరెవరి ప్రభావం మీపై ఉంది?**

జ. గాంధీ, జెపి. లోహియా, కామత్, పట్వార్దన్ మొదలైనవారందరిదీను. ఆలిండియా ఫార్వర్డ్‌బ్లాక్ పార్టీ ఏర్పర్చి సుభాష్‌చంద్రబోసుగారు తన దేశ పర్యటనలో భాగంగా కాకినాడొచ్చారు. సుమారు పాతికవేలమంది ప్రజల్ని ఉద్దేశించి ఆయన ప్రసంగిస్తుంటే అన్నపూర్ణయ్యగారు తెలుగు చేస్తున్నారు. ఇంతలో ఎందుకో

బయటకెళ్ళిన నేను రేడియోలో రష్యా, ఇంగ్లాండులు హిట్లరుకి వ్యతిరేకంగా ఒక్కటైయ్యాయనీ 2వ ప్రపంచ యుద్ధం మొదలైందని విని చిన్న కాగితం ముక్కపై రాసి అన్నపూర్ణయ్యగారికిస్తే ఆయనా విషయాన్ని బోసుగారితో చెప్పారు. వెంటనే నేతాజీ నా చేయి పట్టుకుని వేదికనెక్కించి ఈ పిల్లాడు మంచి వార్త తెచ్చాడని చెప్పి ఇక మనకు స్వరాజ్యం వస్తుందని జోస్యం చెప్పి నన్ను అందరిముందూ అభినందించిన సంఘటన తల్చుకుంటే ఇప్పటికీ ఒళ్ళు గగుర్పొడిచి హృదయం పులకరిస్తుంది.

**ప్ర. అప్పట్లో ఇంకేం కార్యక్రమాలు మీరు చేపట్టారు?**

జ. కాలేజీ రోజుల్లో జైలులో పరిచయమైన కె.యస్. తిలక్, నేనూ, బాట్టం శ్రీరామ్మూర్తి కల్సి సోషలిస్టు పార్టీని స్థాపించాం. దేశవ్యాప్తంగా అనేక కార్మిక సంఘాల్ని నడిపించాం. ఆల్ యిండియా ఎన్.ఎమ్.డి.సి.కి సెక్రటరీగా చేసా. బి.హెచ్.పి.వి., ఆంధ్రా స్టీల్ కార్పొరేషన్, హిందుస్తాన్ షిప్‌యార్డ్, పన్నా డైమండ్ వోర్‌మేన్ మొదలగు సంస్థల లేబర్ యూనియన్‌లను నడిపాను. వివిధ రైతు సంఘాల్ని స్థాపించాను. 'కార్మిక జగత్తు'నే పత్రికను 13 సం॥రాలు నడిపాను. చెరుకు రైతుల విషయంలో సాక్షాత్తూ మద్రాసు ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుగారితో కూడా తలబడ్డాను.

**ప్ర. మీ కాలానికీ, ఈ కాలానికీ కనిపిస్తోన్న తేడాలేమిటి?**

జ. అప్పట్లో సేవా, త్యాగం ప్రజల్లో ఐకమత్యం వుండేవి. ఇప్పుడు మితిమీరిన దురాశ, స్వార్థం, అపనమ్మకం రాజ్యమేలుతున్నాయి.

**ప్ర. గాంధీ విధానంపై విమర్శలకు మీ జవాబు?**

జ. ఈరోజు ప్రపంచానికి గాంధీ విధానాన్ని మించిన ప్రత్యామ్నాయం లేదు. సత్యం, అహింస, త్యాగం మొదలైన విలువలకి ఎప్పటికీ చావులేదు.

**ప్ర. ఈనాటికీ గాంధేయవాదం అవసరమా?**

జ. ఈరోజు మరింతవసరం. వ్యవస్థలో అక్రమాలు, అన్యాయాలు పెరిగాయి. ప్రకృతి వనరుల్ని ఇష్టమొచ్చినట్లు ప్రభుత్వాలే నాశనం చేస్తున్నాయి. ఇలాంటప్పుడు గాంధేయవాదం యొక్క ఆవశ్యకత మరింత పెరిగింది.

**ప్ర. మీ అనుభవాలేమయినా చెప్తారా?**

జ. లెక్కలేనన్నున్నాయి, సమయం సరిపోదు గానీ వోసారి గోరాగారి ఆధ్వర్యంలో సహపంక్తి భోజనాలు ఏర్పాటుచేస్తే బ్రాహ్మణులంతా కొట్టడానికొచ్చారు. సరే ఏదో భోజనాలయ్యాయనుకున్నాక అక్కడున్న ముష్టివాళ్ళకి మిగిలింది ఒడ్డించడం అయిందో లేదో వాళ్ళు ఒక్కక్కరూ వారి విస్తరి పట్టుకుని దూరంగా పోయారు. ఒక్కరిపక్క ఒకరు కూర్చుని తినలేమని స్పష్టం చేసారు. ఈ దేశంలోని కులతత్వం ఎంత క్రూరమైందో అర్థమైంది.

**ప్ర. చివరిగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. నాకిప్పుడు 93 సం॥రాలు. గాంధీ సెంటర్ 89లో పెట్టి ప్రసన్నకుమార్‌గారి ఆధ్వర్యంలో వివిధ కార్యక్రమాలు చేస్తున్నాం. అనేక గ్రంథాలు ప్రచురించాం. బా-బాపూ భవనంలో కొన్ని వేల గ్రంథాల్తో అపూర్వ గ్రంథాలయాన్ని స్థాపించాం. అనేక సదస్సులు, సెమినార్లు ఏర్పాటుచేసి గాంధీ ఆలోచనల్ని ఈ తరానికి అందించేందుకు ప్రయత్నిస్తున్నాం. సత్యం, అహింసల యదార్థ అర్థాల్ని యువత గ్రహించాలి. యాంత్రిక భోగాలే రాజ్యమేలుతున్న ప్రస్తుత కాలంలో సహజసిద్ధంగా, ప్రకృతిబద్ధంగా స్థానిక ఉత్పత్తిని మెరుగుపర్చేలా సుస్థిర అభివృద్ధికీ, గ్రామ స్వరాజ్యానికీ గాంధేయాలోచనలే శరణ్యమని గుర్తించాలి. వినాశకర అభివృద్ధిని వ్యతిరేకించి నవశకానికి నాంది పలకాలి.



గాంధీట్రస్ట్ చైర్మన్

# డి. నారాయణరావుగారి

(హన్మకొండ) ఇంటర్వ్యూ



**ప్ర. మీ బాల్యం, చదువు మొదలైన వివరాలు చెప్పండి?**

జ. వరంగల్ జిల్లా హన్మకొండలో పుట్టాను. మాది బీద కుటుంబం. ఫ్రీ స్టూడెంటుగా వైశ్య హాస్టల్‌లో వుండి చదూకున్నాను. ఎమ్మెస్సీ కష్టపడి చదివాను. ఉస్మానియా యూనివర్శిటీ గోల్డ్‌మెడల్ సాధించాను. విద్యార్థి దశ నుంచే నిజాం వ్యతిరేక భావాల్ని ప్రచారం చేసేవాణ్ని. పి.వి. నరసింహారావుగారు, కాళోజి నారాయణరావుగారు, కాళోజి రామేశ్వర్రావుగారు, సర్దార్ జమాలాపురం కేశవరావుగారు మొదలైన హేమాహేమీలు తలబెట్టే కార్యక్రమాలలో ఆసక్తిగా పాల్గొంటూ ఉండేవాణ్ని.

**ప్ర. మీ ఉద్యోగ సంబంధ విషయాలు చెప్పండి?**

జ. నిజాం కాలేజీలో కొద్దిరోజులు లెక్చరర్‌గా చేసాను. తర్వాత తహశిల్దార్ ఉద్యోగమొచ్చింది. పది సం॥రాలు తహశిల్దార్‌గా, మరో పది సంవత్సరాలు డిప్యూటీ కలెక్టరుగా పనిచేసి ప్రభుత్వ సిఫారసుతో ఐఎఎస్ అయ్యి మరో పది సం॥రాలు సేవలందించాను.

**ప్ర. గాంధేయ భావజాలం ప్రభావం ఎలా ఏర్పడింది?**

జ. చిన్నప్పుడు మా యింటివద్దే రాజరాజనరేంద్ర భాషా నిలయంలో కూర్చుని తెలుగు సాహిత్యం చదివేవాణ్ని. మా అమ్మగారు ఆంధ్ర మహాసభ అనుబంధ సంస్థయిన మహిళా సంఘంలో కార్యకర్తగా వుండేవారు. ఆమెతోపాటు నేనూ సభలకి వెళ్ళేవాణ్ని. అప్పుడే ఏర్పడిన సోషలిస్టుపార్టీ ప్రభావం చాలా వుండేది. అప్పట్లో గాంధీగారు వార్ధానుంచి విజయవాడ వెళ్తూ కాజీపేట వొచ్చినప్పుడు మిత్రులం కొంతమంది ఆయన సభకి వెళ్ళాం. ఆయన నిరాడంబరత చూసి చలించి అప్పటికప్పుడే గాంధీగారికి వీరాభిమానినయ్యాను.

**ప్ర. అప్పట్లో మీరేయే కార్యక్రమాల్లో పాల్గొన్నారు?**

జ. గ్రంధాలయోద్యమం, హిందీ ప్రచారం, మద్యపాన వ్యతిరేకోద్యమం, మొదలైన వాటిల్లోనున్నాను. వార్ధావెళ్ళి గాంధీగార్ని కల్సి అక్కడి కార్యక్రమాలు

పరిశీలించాను. 83లో రిటైరయ్యాక పూర్తిస్థాయిలో సామాజిక సేవా కార్యక్రమాల్ని చేస్తున్నాను.

**ప్ర. మీ సహచరులూ లేక నాయకులుగా ఎవరుండేవారు?**

జ. స్వామీ రామానంద తీర్థగారి అద్భుత ప్రభావం మాపై ఉండేది. ఆ రోజుల్లో ఈ ప్రాంతం మరాట్వాడా, కర్ణాటక, హైద్రాబాద్ కల్సే వుండేవి. కర్ణాటకలో పుట్టి, మహారాష్ట్రలో చదివి, మన ప్రాంతాన్ని కార్యక్షేత్రంగా చేసుకున్న మహానుభావుడు స్వామి రామానందతీర్థ. కాళోజి నారాయణరావు, కొమరగిరి నారాయణరావు, కోదాటి నారాయణరావు, రాజలింగం, హయగ్రీవాచారి మొదలైనవారి ప్రభావం సైతం మాపై ఉండేది.

**ప్ర. మీ కాలానికీ ఈ కాలానికీ గల వ్యత్యాసమేంటి?**

జ. మా కాలంలో కష్టపడి జీవించాలనే ధోరణి వుండేది. ఈ కాలంలో కష్టపడకుండా ఎలా జీవించాలని చూడ్డం ఎక్కువైపోయింది. మోసపూరిత స్వభావం, స్వార్థం బాగా ముదిరిపోయాయి.

**ప్ర. గాంధేయవాదానికి కాలం చెల్లిందంటే ఒప్పుకుంటారా?**

జ. ఒప్పుకోను. ఏనాటికైనా గాంధీవాదం చిరస్థాయిగలది.

**ప్ర. గాంధేయవాదులుగా చెప్పుకుంటూ వ్యక్తిగతంగా దిగజారేవార్ని గూర్చి మీరేమంటారు?**

జ. అలాటివార్ని గురించెంత తక్కువగా మాట్లాడుకుంటే అంత మంచిదంటాను.

**ప్ర. చివరిగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. నాకిప్పుడు 91 సం॥రాలు. అనేక ఆధ్యాత్మిక, సాంఘిక సంస్థలకు సలహాదారుగా ఉన్నాను. కాశీ రామేశ్వరం తదితరచోట్ల సత్రాలు నడుపుతున్నాం. పేదపిల్లలకు చదువు, వసతి, వయోవృద్ధులకు వైద్యం, ఆదరణ అందిస్తున్నాం. యువతకి నైపుణ్య శిక్షణాశిబిరాల్నీ, రోగులకు ఉచిత వైద్య సేవల్నీ అందిస్తున్నాం. 2 వేలమందికి పైగా 12 కుష్టురోగుల కాలనీల బాగోగుల్ని పర్యవేక్షిస్తున్నాం. సమాజంలో 'Simple Living, High Thinking' వుండాలి కానీ 'High Living, Simple Thinking' ఉంటోంది. ఈ పరిస్థితి మారాలి. యువత ఆలోచించాలి.



## ఆజన్మాంత గాంధేయాభిమాని

## గారి

## (రాజమండ్రి) ఇంటర్వ్యూ



**ప్ర. మీ బాల్యం, విద్యాభ్యాసం తదితర వివరాలు చెప్పండి?**

జ. మా నాన్నగారు గాడిచర్ల రామమూర్తిగారు, తల్లి మంగమ్మ. ఆయన నా చిన్నప్పుడే రాజమండ్రిలో స్కూలొకటి నడుపుతుండేవారు. ఆ విధంగా స్వాతంత్ర్యోద్యమ సమయంలో జైలుకెళ్ళారు. అలా నాకు కూడా ఆ భావాలు బాల్యం నుంచే వొంటబట్టాయి.

**ప్ర. గాంధేయవాదిగా ఎలా రూపొందారు?**

జ. మా కుటుంబమంతటికీ గాంధిగారంటే విపరీతమైన భక్తిశ్రద్ధలు. గాంధీగారు మొట్టమొదట హరిజనసేవకై విరాళాలు వసూలు చేస్తూ రాజమండ్రి వచ్చినప్పుడు నేను బాగా చిన్నపిల్లని. ఆయన నన్నుముచ్చటగా దగ్గరకు తీసుకొని చెవికమ్మలు అడిగితే తీసిచ్చేసాను. తర్వాత నేను కాలేజీలో చదూకున్నప్పుడు గాంధీ యాత్ర చేస్తూ మా దగ్గరికొచ్చినప్పుడుసైతం నా చేతి ఉంగరాన్ని ఆయనచేతికిచ్చి బదులుగా నాకేమిస్తారని అడిగితే, ఏమివ్వాలో తోచని ఆయన నూలు వడికే 'తకిలీ' ఒకటి తీసిచ్చారు. అదిప్పటికీ భద్రంగా నా దగ్గరుంది. అలా గాంధీవాద అభిమానినైనాను.

**ప్ర. గాంధీపై అభిమానం, గాంధేయవాదం ఒకటికాదనుకుంటా?**

జ. నిజమే, కాని మాకు మొదట్నుంచీ గాంధీగారంటే ఒకరకమయిన మూఢభక్తే. నేనాయనకు Blind Worshipperని. ఆయన సిద్ధాంతాల కంటే జీవన విధాన మంటేనే నాకు ఆసక్తి.

**ప్ర. మీరేయే కార్యక్రమాల్లో ఉన్నారు?**

జ. స్త్రీ విద్య కోసం అహర్నిశలూ పనిచేసాను. కాకినాడ, విశాఖపట్నం మొదలైన

చోట్ల కాలేజీలు స్థాపించాం. నేను బి.ఎ. చదువుతుండగా వివాహమైంది. ఆయన దిగుమర్తి గోపాలస్వామిగారు డాక్టరు. ముగ్గురు పిల్లలు పుట్టాక ఆయన ప్రోత్సాహంతో లా చదివి పూర్తిచేసాను. వోపికున్నంతవరకూ చేసుకోగలిగిన వృత్తి కాబట్టీ 50 సం॥రాలు నిరవధికంగా ప్రాక్టీసు చేసాను.

**ప్ర. మీ ప్రాక్టీసు అనుభవాలేమయినా చెప్పగలరా?**

జ. గుర్తులేవు. కానీ మొత్తం నా కెరీర్‌లో ఎక్కువశాతం స్త్రీలకి న్యాయం చేయగల సాంఘిక స్పృహ కలిగిన కేసుల్నే వాదించాను. తతిమ్మా ఏవో కొద్దిగా వుండొచ్చునేమో కానీ మొత్తానికైతే యివే ఎక్కువ.

**ప్ర. గాంధీపై నాడూ, నేడూ వచ్చిన, వస్తోన్న విమర్శలపై మీ అభిప్రాయం?**

జ. అలాంటివి నా దగ్గర ప్రస్తావించి వుపయోగం లేదు. గాంధేయవాదం నా మతం. ఆ విధానమంటేనే నాకెనలేని భక్తిభావం. ఆయనేదంటే అదేనిజం, తక్కినవన్నీ అబద్ధం.

**ప్ర. గాంధీమార్గం యిప్పటికీ అనుసరణీయమేనా?**

జ. కచ్చితంగా, ఆయన ఆచరించిన విలువలు ఎప్పటికైనా అనుసరణీయమే. ఐతే, వాట్ని కూలంకుషంగా అర్థం చేసుకోగల పరిపక్వత సమాజంలో ఎంతమందికుందనేదే ప్రశ్నార్థకం.

**ప్ర. చివరిగా, మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. నాకిప్పుడు 90 సం॥రాలు. ఇప్పటికీ నూలు స్వయంగా ఒడుకుతాను. గీత చదువుతుంటాను. దేశవ్యాప్తంగా గాంధీగారికి సంబంధించిన ఏ పుస్తకం వెలువడ్డా అది మరునాడే నా బల్లమీదుంటుంది. దురదృష్టమేంటంటే, ఆయన పేరు ఈరోజున ఫ్యాషనైపోయింది. మంచికీ, చెడుకీ కూడా ఆయన పేరుని వాడుకునేవాళ్ళు చాలామంది తయారయ్యారు. అది తగ్గాలి. ఏవో కొద్దిపాటి సేవా, ప్రచార కార్యక్రమాల్లో పాల్గొంటున్నాను. గతంలా ఆరోగ్యం సహకరించట్లేదు. యువతా, ముఖ్యంగా స్త్రీలు గాంధీమార్గాన్ని అనుసరించాలనేదే నా ఆకాంక్ష.



భూదానోద్యమ చైర్మన్

# సి.వి. చారి గారి

(నల్గొండ) ఇంటర్వ్యూ



**ప్ర. మీ బాల్యం గురించి చెప్పండి?**

జ. నల్గొండ జిల్లా దేవరకొండలో జన్మించాను. విద్యార్థి సంఘాల్లో వుండేవాణ్ణి. స్వాతంత్ర్యోద్యమ చైతన్యం వెల్లివిరుస్తున్న కాలమది. పాతూరి నాగభూషణం, అయ్యంకి వెంకటరామయ్య, గాడిచర్ల హరిసర్వోత్తమరావు మొదలగువారు తలపెట్టిన గ్రంథాలయోద్యమంలో చురుకుగా పాల్గొనేవాడ్ని. అలా గాంధేయ మార్గంవైపు మొగ్గుచూపాను.

**ప్ర. ఇంకే కార్యక్రమాల్లో మీరు పాల్గొన్నారు?**

జ. చాలా ఉన్నాయి. ఆచార్య వినోభాజీతో కలిసి చాలాకాలం తిరిగాను. ఆంధ్రదేశ యాత్ర కొచ్చినప్పుడు ఆయనవెంట నేనూ ఉన్నా. అలాగే కొద్దిపాటి రచనా వ్యాసాంగం చేసాను. సర్వోదయోద్యమంలో చురుకుగా పనిజేసాను. సర్వోదయ మండలికి సంస్థాపక కార్యదర్శిగా చాలా సం॥రాలు ఉన్నాను.

**ప్ర. మీ వ్యక్తిత్వంపై ఎవరెవరి ప్రభావం ఉంది?**

జ. ఎంతోమంది గొప్ప నాయకుల్ని దగ్గరగా చూసి చాలా నేర్చుకున్నాను. మా సోదరుడు ఆర్య సమాజ సభ్యుడిగా వుండేవాడు. ఆ ప్రభావం నాపై ఉండేది.

**ప్ర. ఈ కాలానికీ, మీ కాలానికీ మీరు గమనించిన బేధాలేమిటి?**

జ. నాడు నీతీనిజాయితీలుండేవి నేడు అవినీతి అక్రమాలున్నాయి.

**ప్ర. గాంధేయవాదాన్ని విమర్శించే వారికి మీ జవాబు?**

జ. అలా విమర్శించిన వారుసైతం దానిని (గాంధేయమార్గాన్ని) కాదని ముందుకెళ్ళలేకపోయారు.

**ప్ర. ఈనాటి సమాజానికి గాంధీమార్గం అవసరమా?**

జ. చాలా. సత్యం, అహింస, శాంతి, సద్భావం గాంధీవాద మౌలిక సూత్రాలు. అవే కాలంలోనైనా సమాజ అభ్యున్నతికి అవసరమే. పైగా అనేక సంక్లిష్ట సమస్యలతో సతమతమవుతున్న నేటి తరాలకి గాంధేయమార్గం మరింత అవసరం.

**ప్ర. పైకి గాంధేయవాదులుగా ప్రచారం చేసుకొంటూ వ్యక్తిగత జీవితంలో దిగజారి జీవిస్తున్నవారి వల్ల సిద్ధాంతానికి నష్టం కాదా?**

జ. నష్టమే. అలాంటి వారివల్ల సమాజమెంతో నష్టపోతోంది.

**ప్ర. ఇక, చివరగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. భారద్దేశం ఆధ్యాత్మికమైంది. ఈ దేశం పుణ్యభూమి, కర్మభూమి, జ్ఞానభూమి. అలాటి దేశంలో జన్మించాలంటే ఎంతో పుణ్యం చేసుకోవాలని చైనాలో విశ్వాసం కూడా వుంది. అలా విశ్వానికే గురువనదగ్గ దేశంలో జన్మించి జీవితాన్ని దుర్వినియోగం చేయడం కంటే దౌర్భాగ్యం మరోటి లేదు. నాకిప్పుడు **84** సం॥రాలు. ఎన్నో సంస్థలకు అధ్యక్షుడిగా ఉన్నాను. ఆం.ప్ర. గాంధీ స్మారక నిధి, గాంధీ గ్రంథాలయానికీ ప్రెసిడెంట్‌ని, గాంధీ బోర్డుట్రస్టీని. మానవాళి వల్ల జనించిన క్లిష్ట సమస్యలన్నింటికీ గాంధీ మార్గమే శరణ్యం.



## గాంధేయ ప్రచారకులు



గారి

(గుంటూరు) ఇంటర్వ్యూ

**ప్ర. మీ బాల్యం, చదువు వివరాలు చెప్పండి?**

జ. తెనాలి వద్ద వల్లభాపురంలో భూస్వామ్య కుటుంబంలో పుట్టా. విద్యార్థి దశలోనే స్వాతంత్ర్యోద్యమ ప్రభావం దేశంమీద ఎంతుందో ప్రత్యక్షంగా చూసా. తెనాలి రైల్వేస్టేషన్‌మీద దాడిచేసి తగలబెట్టిన సంఘటనకు నేను ప్రత్యక్ష సాక్షిని. అప్పుడే విద్యార్థులు హర్తాళ్ళు చేసారు. ఆనాడు జరిగిన పోలీసు కాల్పుల్లో ఒకబ్బాయి చనిపోయాడు.

**ప్ర. గాంధేయవాద ప్రభావం మీపై ఎలా పడింది?**

జ. అగ్రికల్చర్ బియస్సీ 1952లో చేసి ఉత్తరాంధ్ర, తెలంగాణ ప్రాంతాల్లో పనిచేసాను. అంతకుముందే మా మేనమామ కూర్మారావు గారి ప్రభావం నాపై వుండేది. ఆయన గాంధేయవాది, ఆర్య సామాజికుడు, గోరాగారి శిష్యుడు. అప్పట్లో సహపంక్తి భోజనాల్లో పాల్గొన్నందుకు గ్రామంలోంచి మా కుటుంబాన్ని వెలివేసారు. అప్పుడు నా వయసు 14 సం॥రాలు. ఆ సంఘటన నా మనసుపై చెరగని ముద్ర వేసింది. దాంతో ఆ తర్వాత పూర్తిస్థాయి సామాజిక కార్యకర్తగా మారాను.

**ప్ర. ఏయే కార్యక్రమాలు చేసేవారు?**

జ. విద్యార్థులకి అధ్యయన తరగతులు, నిరుద్యోగులకి శిక్షణ తరగతులు, పసిపిల్లలకి సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలు, ఆటల పోటీలు పెట్టేవాళ్ళం. 'సత్యశోధన' పేరిట తెనిగీకరించబడిన గాంధీ ఆత్మకథ పుస్తకాలను గ్రామాల్లోని పాఠశాలలకు పట్టుకెళ్ళి ఇచ్చి, చదవమని చెప్పి, దానిపై పరీక్ష పెట్టేవాణ్ణి. మా ఊర్లోని దేవాలయంలో వార్షికోత్సవాల సందర్భంగా పూజలూ, భజనలే కాక ప్రజల్నీ, రైతుల్నీ చైతన్యవంతం చేసే కార్యక్రమాలు పెట్టేవాడ్ని. అంతేకాదు, నాలుగురోడ్ల

కూడళ్ళలో మెడకి గాంధీ సూక్తుల్ని అట్టబోర్డులపై రాసుకుని తగిలించుకుని నిలబడేవాడిని. అలాగే, ఈరోజు గొప్పగా ప్రచారం చేస్తోన్న పాలేకర్ వ్యవసాయ విధానాల్ని ఆనాడే అమలు చేసాను. భూసారం నిలుపుకోవాలనీ, ప్రకృతిసిద్ధమైన జీవనాన్ని అవలంభించాలని ప్రచారం చేస్తూ కరపత్రాలు ప్రచురించేవాడ్ని. వూరంతా తిరిగి పశువుల పేడను సేకరించేవాడ్ని. అప్పుడు గ్రామంలో నన్నో పిచ్చాడ్ని చూసినట్లు చూసేవారు.

**ప్ర. మీ కాలానికీ ఈ కాలానికీ కనిపిస్తున్న బేధాలేమిటి?**

జ. ఆనాడు త్యాగాలే ప్రధానం - ఈనాడు భోగాలే ప్రధానం. ఆలోచనలు, ఆదాయాలు పెరగడంతో అవాంఛనీయ కోరికలు, అక్కర్లేని సుఖాలు వాట్ని తీర్చుకునేందుకు తాపత్రయం, తంటాలు పడటం యివి పెరిగాయి. అంతేగాని నైతికత పెరగలేదు, పెద్దవాళ్ళపై గౌరవం తగ్గడంతో స్వతంత్రాలోచనలు పెరిగాయి.

**ప్ర. గాంధీమార్గం ఈనాటి వ్యవస్థకి అవసరమా?**

జ. కచ్చితంగా. గాంధీమార్గం ఏనాటి వ్యవస్థకైనా శాశ్వతావసరం.

**ప్ర. గాంధేయవాదానికి కాలం చెల్లిందనే విమర్శలున్నాయి కదా?**

జ. గాంధీగారి ఆలోచనల్ని అర్థం చేసుకోలేనివారు, కనీసం అలా అర్థం చేస్కోడానికి ప్రయత్నించనివారూ నాడూ-నేడు కూడా కొందరున్నారు. వాళ్ళే విమర్శిస్తున్నారు.

**ప్ర. సమాజంలో మార్పు ఎలా సాధ్యం?**

జ. మేధోశ్రమకున్న గుర్తింపూ, గౌరవం శారీరక శ్రమకు కూడా ఇవ్వగల స్థాయికి వ్యవస్థ ఎదగాలి. శ్రమ సంస్కృతితోనే మార్పు సాధ్యం. మేధావులు, డాక్టర్లూ, ఇంజనీర్లూ శ్రమపట్ల అభిరుచి పెంచుకోవాలి.

**ప్ర. చివరిగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. నాకిప్పుడు 85 సం॥రాలు. అప్పట్లోనే నే రాసిన విల్లులో నా దేహాన్ని అవయవదానానికి కేటాయించమన్నాను. పరుల కోసం ఉపయోగపడ్డంలోనే మానవ జీవిత సార్థక్యముందనుకుంటాను. వ్యక్తి సౌఖ్యానికైనా, వ్యవస్థ సౌభాగ్యానికైనా ఇదే శరణ్యం.



# గాంధేయ ఆలోచనాపరురాలు



## గారి

## (విశాఖపట్నం) ఇంటర్వ్యూ

**ప్ర. మీ బాల్యం-చదువు తదితర వివరాలు చెప్పండి?**

జ. మా నాన్న దిగుమర్తి రామస్వామిగారు, అమ్మ జానకీబాయి. స్వాతంత్ర్యోద్యమ సమరంలో భాగంగా వాళ్ళిద్దరూ అరెస్టయ్యారు. తమిళనాడులోని వెల్లూరు జైలులో శిక్షననుభవిస్తూ వుండగా నేను పుట్టాను. అలా అక్కడి తోటి ఖైదీలే నాకు మాయాదేవి అని నామకరణం చేసారు. తర్వాత మా మామ్మగారు బరంపురంలోని రఘునాధస్వామికి మొక్కు చెల్లించుకునే నిమిత్తం నా పేర్లో 'రఘు' కలిపితే రఘుమాయాదేవినయ్యాను. వైజాగ్, ఎలమంచిలి, మచిలీపట్నం, మద్రాస్‌లో చదూకున్నా.

**ప్ర. ఇంకేం ఇతర కార్యక్రమాల్లో పాల్గొన్నారు?**

జ. 22 సం॥రాలకి నాకు వేములకొండ మాణిక్యాలరావుగారితో వివాహమైంది. ఆయనుద్యోగం నిమిత్తం మేమిరువురం దామోదర్ వ్యాలీ కార్పొరేషన్ నిర్దేశించిన బీహార్‌లో (ఇప్పుడు జార్ఖండైంది) 30సం॥రాలు ఉన్నాం. స్వాతంత్ర్యం వచ్చాక కట్టిన మొట్టమొదటి డ్యామ్ ఐన తిలయ్యా ప్రాజెక్ట్‌లో సాయిల్ ఎక్సామినర్‌గా ఆయన పనిజేసేవారు. నేను అక్కడే హెూమియోపతి చదివి డిగ్రీ తీసుకుని సేవ మొదలెట్టాను.

**ప్ర. గాంధేయవాద ప్రభావం మీపై ఎలా పడింది?**

జ. నాకైతే గుర్తులేదు కానీ గాంధీగారు వచ్చినప్పుడు నేనాయన ఒళ్ళో కూర్చుని గారం చేసానట. ఆయనడిగితే వెంటనే చేతులకున్న గాజులు తీసిచ్చేసానట. అలా గాంధీగారంటే మొదట్నుంచీ నాకెంతో అభిమానం.

**ప్ర. గాంధీపై వొచ్చిన విమర్శలపై మీరేమంటారు?**

జ. మనిషన్నవారికెవరికైనా విమర్శలు సహజం. మంచి పనులు చేసే వారిలోనైతే ఏ చిన్న తప్పు దొరుకుతుందా అని సాకువెతికేవారే ఎక్కడైనా ఎక్కువుంటారు.

**ప్ర. ఈ కాలానికీ, మీ కాలానికీ మీక్కనిపిస్తున్న తేడాలేంటి?**

జ. అది గాంధీకాలం, యిది కలికాలం. ఏదో అద్భుతం జరిగితే కాని ఈ కాలానికిక మార్గాంతరం లేదు.

**ప్ర. గాంధీమార్గం ఈనాటికీ అవసరమా?**

జ. అవసరమే. ఆయన ఫోటోల్ని గోడలపైకెక్కించే బదులు ఆయన మాటల్ని మనసుకెక్కించుకోడం మేలు. అప్పట్లోనే భారత -పాకిస్తాన్ విభజనతో ఆయన మనసు కల్లోలమయింది. ఆయన్ని వేధించిన ప్రధాన సమస్యలీనాటికీ అలాగే వుండటం మన దౌర్భాగ్యం.

**ప్ర. నేటి రాజకీయాలపై మీ అభిప్రాయం?**

జ. నెహ్రూ కాలంలో ఏవో కొద్దిరోజులే తప్ప తర్వాత రాజకీయాలు పాడైపోయాయి. వీటి ప్రక్షాళన ఎప్పుడో?

**జ. చివరిగా, మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. 89లో అనుకుంటాను. రిటైరై విశాఖ కొచ్చేసాక 'మల్లెమడుగుల లలితాంబ బంగారయ్య ట్రస్ట్'ను పెట్టి వివిధ కార్యక్రమాలు చేస్తున్నాం. బాలబడి మొదలుకుని వయోజన విద్య, బాలకార్మిక వ్యవస్థ నిర్మూలన, వృత్తివిద్యా శిక్షణ మొదలైన కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. నాకిప్పుడు 83 సం॥రాలు. ఆయనీమధ్యే గతించారు. శేష జీవితాన్ని పరోపకారం కోసం గడపడానికి మించినదేదీ లేదంటాను, వుంటాను.



# సర్వోదయ నాయకులు

గారి

(నాగర్ కర్నూల్) ఇంటర్వ్యూ



**ప్ర. మీ బాల్యం - విద్యార్థి దశ గురించి చెప్పండి?**

జ. కృష్ణాజిల్లా ఉయ్యూరు స్వస్థలం. బెజవాడలో చదూకున్నా. విద్యార్థి దశనుంచే డి.ఎస్.యు. (డెమొక్రటిక్ స్టూడెంట్ యూనియన్)లో వుండేవాడ్ని. అప్పట్లోనే చైతన్య, తూమాటి వంటివారి కార్యక్రమాల్లో పాల్గొంటూ సోషలిస్టు చైతన్యంతో వుండేవాడ్ని.

**ప్ర. స్వాతంత్ర్యోద్యమంలోకెలా ప్రవేశించారు?**

జ. బెజవాడ నుంచి 'యువక' అనే పక్షపత్రిక నడిపేవాణ్ణి. మద్దూరి అన్నపూర్ణయ్యగారి 'వెలుగు' పత్రికకు ఏజెంట్‌గా వుండేవాణ్ణి. అన్నపూర్ణయ్యగారు జైభారత్, నవశక్తి పత్రికలు కూడా నడుపుతుండేవారు. ఆ కాలంలోనే కొల్లూరు కోటేశ్వర్రావుగారు 'తెలుగు విద్యార్థి' నడిపేవారు. సోషలిస్టు పార్టీ ఆధ్వర్యంలో కర్నూలు జిల్లా కరివెన ఈనాం రైతు సత్యాగ్రహంలో గోరాగారు, కె.ఎస్. తిలక్‌గారు, ఎమ్.వి. సుబ్బారెడ్డి, పి.ఎస్. రాజు, గామాగో (గాంధీ-మార్క్స్-గోరా) మొదలగువార్తో బాటు నేనూ అరెస్టయ్యాను.

**ప్ర. సర్వోదయోద్యమంలో కెలా వచ్చారు?**

జ. భూ సమస్య శాంతియుత పరిష్కారం కొరకై భూదానోద్యమాన్ని ఆచార్య వినోభాజీ 1951లో నల్గొండజిల్లా పోచంపల్లి నుండి ప్రారంభించారు. సోషలిస్టు నాయకుడైన జయప్రకాష్‌నారాయణ్ వినోభా ఉద్యమానికి మద్దతిస్తూ ఆయనతో కలిసి నడిచారు. అలా ఉమ్మెత్తులు కేశవరావుగారాధ్వర్యంలో ఇందులో చేరి మహబూబ్‌నగర్ జిల్లాకు కార్యకర్తగా వొచ్చి నాగర్ కర్నూల్ కేంద్రంగా 20వేల

ఎకరాల్ని పేదలకు పంచిపెట్టాం. 1956లో వినోభాజీ చేసిన మహబూబ్‌నగర్ జిల్లా పర్యటనలో ఆయన వెంట నేనూ ఉన్నాను. అప్పుడే నెహ్రూ ఇక్కడి కొచ్చి వినోభాజీని కలవడం జరిగింది. అలానే 35 గ్రామాల్ని దత్తత తీస్కుని అనేక అభివృద్ధి పనులు చేస్తున్నాం. చెరువులు, రోడ్లు, మరుగుదొడ్లు, ఉపాధి లక్ష్యంగా పనిచేస్తున్నాం.

**ప్ర. ఇంకా ఏయే కార్యక్రమాలు చేపట్టారు?**

జ. భూదానోద్యమం, గ్రామదానోద్యమాల్లో విస్తృతంగా పాల్గొన్నాను. హరిజన బాలబాలికల హాస్టల్‌ని నడిపాను, మత సామరస్యత కోసం పనిచేసాను. గాంధీ నిర్మాణాత్మక కార్యక్రమంలో భాగంగా స్వామీ రామానంద తీర్థ గారాధ్వర్యంలో హైద్రాబాద్ ఖాదీ సమితి తరపున ఖాదీ ఉత్పత్తిలో పాల్గొనేవాడ్ని. జె.పి. సంపూర్ణ విప్లవ లక్ష్యంకోసం పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి అధ్యక్షతన తిరుపతిలో ఏర్పడ్డ 'లోక్‌సమితి' సంఘానికి నేను కార్యదర్శిగా ఉండేవాడ్ని. అలాగే జనతాపార్టీకి కార్యదర్శిగా చేసా. హిందీ ప్రచారం చేసేవాడ్ని. మద్యపానానికి వ్యతిరేకంగా 200 మందితో ఢిల్లీలో ప్రదర్శన నిర్వహించాను. అప్పుడే నన్ను అఖిల భారత నిషాబందీపరిషత్‌కి ఎన్నుకున్నారు.

**ప్ర. మీ కాలానికీ - ఈ కాలానికీ మీకేం తేడా కనిపిస్తోంది?**

జ. అప్పట్లో కష్టపడి సంపాదించాలనుకునేవారు, ఇప్పుడు కష్టపడకుండా సంపాదించడమెలానో నేర్చుకుంటున్నారు, తృప్తి పడట్లేదు.

**ప్ర. గాంధేయవాదంపై విమర్శలకు మీరిచ్చే జవాబు?**

జ. గాంధీమార్గం కంటే ప్రత్యామ్నాయం ప్రపంచానికి ఈరోజు లేదు. ఆయన్ని విమర్శించినవారు కూడా అది అంగీకరించక తప్పదు. గాంధీ ఒక అహింసా తత్వవేత్త, సత్యాన్వేషణా శాస్త్రవేత్త. అందుకే బౌద్ధంలాగానే గాంధేయవాదం కూడా దేశదేశాల్లో వ్యాపించింది.

**ప్ర. స్వాతంత్ర్యోద్యమకారులుగా చెప్పుకుంటోన్న స్వార్థపరుల గురించి?**

జ. డా॥ వెంపటి సూర్యనారాయణ, తెన్నేటి విశ్వనాథం, గెడ్డం సన్యాసిరావు, ఆర్.కె. రామన్, ఎర్నేని సుబ్రహ్మణ్యం, మేతే నారాయణరావు, స్వామి సీతారాం,

నేతి వెంకట చలపతి, ఉప్పులూరి మల్లిఖార్జునరావు, వెన్నెలకంటి రాఘవయ్య, వి. వీరబ్రహ్మం, కె. వైద్యనాథ్, అల్లూరి సుబ్బారావు, దుర్గాబాయమ్మ లాంటి నిస్వార్థపరులెన్నడో అంతరించారు. ఈనాటి స్వార్థపరుల గురించి మాట్లాడక పోవడమే మంచిది.

**ప్ర. చివరిగా మీరేం చెప్పాలనుకుంటున్నారో చెప్పండి?**

జ. నాకిప్పుడు 81 సం॥రాలు నాగర్ కర్నూల్‌లోనే ఒక వికలాంగుల రెసిడెన్షియల్ హాస్టల్ నడుపుతున్నాను. అందరికీ కూడు, గూడు, గుడ్డ, పని, విద్య, ఆరోగ్యం కావాలనేదే నా స్వప్నం. ఠాగూర్ దాస్‌సింగ్ రాసిన 'లోక్‌స్వరాజ్' అనే రచనను శివలెంక గిరిజగారి చేత తెలుగనువాదం చేయించాను. రాష్ట్ర సర్వోదయ మండలి అధ్యక్షునిగా నేనూ, కార్యదర్శిగా ప్రసాద్ అనేక కార్యక్రమాలు చేసాం. ఈనాటి యువత వినేందుకు సిద్ధంగానే ఉన్నారు. అయితే వారికి చెప్పేందుకే ఎవరూ లేరు. అలాటి నిస్వార్థ నాయకుల్ని తయారుచేసుకున్న రోజున సమాజం సుస్థిరత సాధిస్తుంది. లోకం సస్యశ్యామలమవుతుంది.



ప్రజాసేవాశ్రమం స్థాపకులు

# అరవింద్‌జైన్ గారి

## (ఏలూరు) ఇంటర్వ్యూ



**ప్ర. మీ బాల్యం, విద్య గురించి చెప్పండి?**

జ. రాజస్థాన్‌లోని పాళీ జిల్లాలోని మార్వార్ మండలం దేవ్‌లీ అనే గ్రామంలో నేను జన్మించాను. డబ్బు సంపాదన కోసం వలసబాటపట్టే క్రమం అప్పటికే మార్వాడీల్లో మొదలైంది. అక్కడ్నే వర్ధానా అనే ప్రాంతంలో దట్టమైన అడవిలోగల వొక గురుకులంలో మెట్రిక్ చదివి, తర్వాత గాజుల వ్యాపార నిమిత్తమై ఏలూరొచ్చి అల్లోపతి, నేచిరోపతి మెడిసిన్‌లు చదివాను.

**ప్ర. గాంధేయ భావజాలానికి బీజమెలాపడింది?**

జ. వ్యాపారం చేస్తున్నప్పుడు దొరికే తీరిక సమయంలోనే విపరీతంగా సాహిత్యం చదివేవాణ్ణి. అలా గాంధీ ఆత్మకథ నన్నాకర్షించింది. ఆ క్రమంలో 22 సం॥రాలకే జీవిత వైరాగ్యం సిద్ధించి ప్రాపంచిక సుఖాల్ని విడనాడి గాంధేయ మార్గంలో ఆశ్రమం పెట్టాలనుకున్నా.

**ప్ర. అంటే, వివాహం చేసుకోలేదా?**

జ. లేదు. పెద్దలు ఎంతో ఆలోచించి కుదిర్చిన సంబంధాన్ని నా మార్గానికి అడ్డమొస్తుందని కాదన్నాను. ఆమెంత ఉన్నతమైనదంటే, నా సంఘ సేవా దృక్పథానికీ, ఆధ్యాత్మిక ఆసక్తికీ స్ఫూర్తిచెంది తాను కూడా ప్రాపంచిక సుఖాల్ని వొద్దనుకుని జైన సన్యాసిగా మారిపోయింది.

**ప్ర. మీరేయే కార్యక్రమాలు చేపడుతున్నారు?**

జ. 'జనకళ్యాణ్ సమితి' పేర్తో చాలాకాలం గ్రంథాలయాన్ని నడిపాం. గోసంరక్షణ సమితి వారితో కల్సి గోసేవ చేసేవాళ్ళం. కార్పోరేట్ వైద్య విధానానికి వ్యతిరేకంగా

1971లో ప్రజాసేవా ఆశ్రమం స్థాపించి అందులోనే నేచురోపతీ, అల్లోపతీ క్లినిక్‌ల్ని నడుపుతున్నాం. స్త్రీలకు కుట్టుమిషను నేర్పిస్తున్నాం. వారానికోసారి స్త్రీ వైద్యుల్ని ప్రత్యేకంగా పిలిపించి స్త్రీ సమస్యల్ని చూస్తాం. అలాగే దాదాపు 30 సం॥రాలు ప్రజాసేవా కాన్వెంట్ పేర్తో పాఠశాలని నామమాత్రపు రుసుముతో, నాణ్యమైన విద్యతో నడిపాను.

**ప్ర. ఇంతచేసిన మీరు కుల మత చిహ్నమైన 'జైన్'ని పేర్లోంచి ఎందుకు తీయలేదు?**

జ. అదేం అగ్రకులస్తుడ్ననే భావంతో పెట్టుకున్నది కాదు. చిన్నప్పట్నుంచి అలాగే వుంది. అలానే ఉండనిచ్చాను. అంతే.

**ప్ర. 'ప్రజాసేవాశ్రమం' అనే పేరే ఎందుకెంచుకున్నారు?**

జ. వ్యాపారంలో సంపాయించింది చాలు అనుకున్నాక గాంధేయ ఆలోచనలతో ఏదైనా సొంతంగా చేయాలనుకున్నాను. పెళ్ళి చేసుకోకపోతే కుటుంబ సభ్యులు ఆత్మహత్య చేసుకుంటామని బెదిరించినా లొంగలేదు. మామూలుగా ఆశ్రమాలంటే దేవుళ్ళూ, దెయ్యాలు, బాబాలు, అమ్మలే గుర్తుకొస్తారు. అలా రాకుండా వుండాలనే ఆ పేరు పెట్టుకున్నా. స్వశక్తితో మొత్తం నిర్మాణాన్ని దశలవారీగా పూర్తిచేసా. అర్థరూపాయికే నాణ్యమైన వైద్యం అందించేవాళ్ళం. అందుకనే చుట్టుప్రక్కల అర్థరూపాయి ఆసుపత్రిగానే ఇది ప్రసిద్ధి చెందింది.

**ప్ర. మీ కాలానికీ, ఈ కాలానికీ గమనించిన తేడా ఏంటి?**

జ. అప్పట్లో పాపభీతుండేది. నీతీ, నిజాయితీ వుండేవి. యిప్పుడేవీ?

**ప్ర. గాంధేయవాదానికి కాలం చెల్లిందనే వాదనపై మీ భావం?**

జ. గాంధేయవాదానికి కాలం చెల్లడమంటే మంచితనానికీ, మానవత్వానికీ కాలం చెల్లడమే. అవెప్పటికీ వుంటాయి.

**ప్ర. చివరిగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. నాకో కాలు పోలియో, కొద్దిగా యిబ్బంది. ఆశ్రమం స్థాపించి గత 45 సం॥రాలుగా తోచిన సేవ వృద్ధులకీ, బీదలకీ చేస్తున్నా. వ్యక్తుల ప్రమేయంతో

ఎన్నో సంస్థలు మూతపడ్డం చూసినవాణ్ని కావున ఒక్క మిత్రుడి సాయంతో నేటిదాకా ఒక్కడ్నే దీన్ని నడిపాను. ఈ ఆశ్రమ స్థాపనలో నాకెంతగానో సహకరించిన టి. శాంతమ్మగారి స్మృతిగా 'స్వర్గలోకం చూసివచ్చిన సామాన్యుడు' అనే చిన్న రచన చేసాను. అదెంత ప్రాచుర్యం అయిందంటే యిప్పటికి 8 సార్లు ముద్రితమవ్వడమే కాక హిందీలోకి కూడా అనువదించబడి ప్రజాదరణ పొందింది. అలాగే మరికొన్ని రచనలు చేయాలనుకొంటున్నాను. 20 సం॥రాలు ఆశ్రమగేటు దాటనని దీక్ష తీస్కుని పూర్తిచేసాను. అలాగే 45 సం॥రాలుగా మా ఊరు మొహం చూడలేదు. మానేపల్లి మల్లిఖార్జునగుప్తాగారు, పి.వి. రాజుగారుల ప్రభావం నాపై ఉంది. నా తదనంతరం బ్రహ్మకుమారీస్‌కి ఆశ్రమాన్ని అప్పగిద్దామనుకుంటున్నా. గాంధీజీ కలలు కన్న గ్రామ స్వరాజ్యాన్ని చూడాలనేదే నా చిరకాల స్వప్నం, సెలవు.



# నిస్వార్థ రాజకీయ నాయకులు



## గారి

## (హుజూరాబాద్) ఇంటర్వ్యూ

**ప్ర. మీ చిన్నతనం, చదువు తదితర విషయాలు చెప్పండి?**

జ. మాది కరీంనగర్ జిల్లా హుజూరాబాద్ తాలూకా పోతిరెడ్డి పల్లనే గ్రామం. స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబం. వరంగల్‌లో చదూకున్నాను. జయప్రకాష్ నారాయణకి మా కుటుంబంతో మంచి సంబంధాలుండేవి. గాంధీ అంటే కుటుంబానికెంతో భక్తి. అలా బాల్యంలోనే నాకు సరైన బీజం పడింది.

**ప్ర. మీ రాజకీయ రంగ కార్యక్రమాల గురించి చెప్పండి?**

జ. మొదట్నుంచీ సోషలిస్టు పార్టీ సభ్యుడ్ని. నా సోదరుడూ నేనూ ఒకేసారి అంటే, 1972లో నేను కరీంనగర్, ఆయన వరంగల్‌కు ఎమ్మెల్యేగా గెలుపొందాం. అనేక కార్యక్రమాల్లో పాలు పంచుకున్నాను. 30 సం॥రాలు వయోజన విద్యాకార్యక్రమాలు చేసాం. నా ఆధ్వర్యంలో ఐదారొందల గోబర్‌గ్యాస్ ప్లాంట్లను ఏర్పాటు చేసా. 100 గ్రామాలు కల్సి సమితిగా ఏర్పడి అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు నాయకుడ్ని ఎన్నుకునేవారు. అలా సమితి ప్రెసిడెంటుగా మూడుసార్లు ఎన్నికయ్యాను. 40 సం॥రాలుగా ఖాదీ ప్రచారోద్యమంలో ఉన్నాం. నేను స్వయంగా తక్కువ సమయంలో ఎక్కువ నూలు వచ్చే రాట్నం తయారుచేసాను. సైకిల్ చర్ఖా పేరుతో చేసిన ఈ ప్రయోగం ద్వారా 16 దారాలు ఒకేసారి చెయ్యొచ్చును.

**ప్ర. ఇంకెవరెవరి ప్రభావం మీపై ఉండేది?**

జ. రాం మనోహర్ లోహియా నాయకత్వ ప్రభావం నాపై ఉంది. గాంధీయే లేపోతే లోహియా లేరనే వారాయన. అలాగే స్వామి రామానందతీర్థ, పి.వి. నరసింహారావు మొదలైన ప్రముఖుల్తో పనిజేసాను.

**ప్ర. మీ కాలానికీ, ఈ కాలానికీ కనిపిస్తున్న తేడాలేమిటి?**

జ. రోజుకు 350 అత్యాచారాలు, హత్యలు, అక్రమాలు జరుగుతున్న సమాజంలో విలువల పరిరక్షణ అవసరం. అది మా కాలంలో ఎంతో కొంతుండేది. ఈ రోజు అసలు కనిపించట్లేదు.

**ప్ర. కమ్యూనిస్టులు మొదలుకుని అంబేద్కరిస్టుల వరకూ గాంధీని విమర్శించడంపై మీ అభిప్రాయమేమిటి?**

జ. కమ్యూనిజాన్ని మించిన ప్రజా సిద్ధాంతం గాంధీది. అందుకే దాన్ని గాంధేయ సోషలిజమంటారు. నా దృష్టిలో కమ్యూనిజానికీ, గ్రామ స్వరాజ్యానికీ పెద్దగా తేడాలేదు. ఇక విమర్శల విషయానికొస్తే వాటిల్లోని డొల్లతనం చేసినవారికే తెల్సు.

**ప్ర. మీ పేరులో కులచిహ్నమైన రెడ్డిని ఎందుకు తొలగించలేదు?**

జ. అది పేరే గాని కులభావనకాదు. నిజం చెప్పాలంటే ఈనాడున్న కులతత్వం ఆనాటి రాజకీయాల్లో ఇంతగా లేదు. ప్రజాస్వామ్యం కులమత భావనల్ని ఎక్కువ చేస్తోంది.

**ప్ర. గాంధేయవాదులుగా చెప్పుకునేవారి వ్యక్తిగత దిగజారుడుతనం గురించి?**

జ. అలాంటి ఆషాడబూతుల వల్ల గాంధీమార్గం చాలా నష్టపోయింది.

**ప్ర. ఈనాటి వ్యవస్థకి గాంధేయవాదం అవసరమా?**

జ. ఈరోజు ప్రపంచం ఎదుర్కొంటున్న క్లిష్ట సమస్యలకు గాంధీ మార్గమే పరిష్కారం. గ్లోబల్ వార్మింగ్ మొదలుకుని ఎన్నో భయంకరమైన సమస్యల్ని అధ్యయనం చేసిన పెద్ద పెద్ద శాస్త్రవేత్తలు సైతం గాంధీమార్గానికి మొగ్గుచూపుతున్నారు. రాట్నం ద్వారా స్వరాజ్యాన్ని తెస్తాననడం, ఉప్పును సత్యాగ్రహంతో కలపడం, స్త్రీలను, గ్రామాల్నీ బలోపేతం చేసేలా ఖాదీతదితర కుటీర పరిశ్రమల్ని స్థాపించడం ప్రపంచ విప్లవ చరిత్రలోనే వినూత్న ప్రయోగం. బహుశా అందుకే రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యం సైతం మహాత్ముని మొక్కవోని దీక్షముందు తలవంచి బ్రిటన్‌లో పార్లమెంట్ ముందు ఆయన విగ్రహం పెట్టింది.

**ప్ర. చివరిగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. నాకిప్పుడు 82 సం॥రాలు. కరీంనగర్ జిల్లాలోగల వావిలాల ఖాదీ గ్రామోద్యోగ్ సంస్థకు ఛైర్మన్‌ని. అలాగే భాగ్యనగర్ ఖాదీ గ్రామోద్యోగ్ ప్రతిష్ట సంస్థకు కార్యదర్శిని. ఇప్పటికి 4 కోట్ల రూపాయల ఖాదీని ఉత్పత్తి చేసాం. తెలుగు రాష్ట్రాల్లో మాదే ప్రథమంగా ఉన్నది. ఆదర్శ కాలేజీని కొంతకాలం నడిపి ప్రభుత్వానికి అప్పగించేసా. సహజసిద్ధంగా, ప్రకృతిబద్ధంగా జీవించే తరాలు రావాలన్నదే నా ఆకాంక్ష.



# అనుబంధం

## అజాద్ హింద్‌ఫౌజ్ యోధులు



## గారి

## (వేపాడ) ఇంటర్వ్యూ

**ప్ర. మీ బాల్యం, చదువు తదితర వివరాలు చెప్పండి?**

జ. నేను విజయనగరం జిల్లా వేపాడు గ్రామంలో **1926** డిసెంబరు **31**న జన్మించాను. తల్లి బురాఖ్, తండ్రి షేక్ పీర్ సాహెబ్. మాది కసాయి కొట్టు. అదిగాక అప్పట్లోనే అమ్మానాన్న బర్మావెళ్ళి కొంత సంపాయించుకొచ్చారు. ఆ రోజుల్లో చదువుకు పెద్దగా విలువుండేది కాదు. ముఖ్యంగా గ్రామాల్లో ఏ కుర్రాడైనా కాస్తెక్కువ చదువుతూంటే, ''ఏరోయి, కోమటోడిలా పద్దులు రాస్తావా? పంతులోడిలా పంచాగం చూస్తావా?'' అంటూ ఏడిపిస్తూ హేళన చేసేవారు. నేను ఎస్. కోట (శృంగవరపుకోట)లో ఎస్.ఎస్.ఎల్.సి. చదువుదామని అనుకున్నాను. కాని పరిస్థితుల వల్ల కుదరలేదు. అలా ఊర్లోనే ఏదో పని చేసేవాణ్ణి.

**ప్ర. బర్మా ఎందుకు వెళ్ళారు?**

జ. అప్పట్లో రబ్బరు ఎస్టేటులో పనిచేసేందుకు ఇక్కడ్నుంచీ ఎంతోమంది వెళుతుండేవారు. అలా పన్నెండేళ్ళప్పుడే రోజుకి పావలా కూలికి బర్మాలోని మర్‌గోయీ జిల్లాలో 'కింగ్ ఐలాండ్ రబ్బరు ఎస్టేట్'లో కుదిరాను. అక్కడి కష్టాల్ని కడుపుకోసం భరిస్తూనే సుమారు **4** సం॥రాలు పన్చేసా. ఇంతలో **1939**లో **2**వ ప్రపంచయుద్ధం మొదలైంది. జపాన్ సింగపూర్ మీద దాడిచేసి ఆక్రమించుకుంది. నేతాజీ ఆజాద్‌హింద్ ఫౌజ్‌ను స్థాపించి ఆంగ్ల ప్రభుత్వాన్ని ఎదిరించమని యువతకి పిలుపునిచ్చారు.

**ప్ర. అప్పుడే మీరు ఇండియన్ నేషనల్ ఆర్మీలో చేరారా?**

జ. అవును. నేతాజీ సుభాష్‌చంద్రబోస్ ప్రభావం భారతీయ యువతపై అంతాయింతా లేదు. ప్రపంచ వ్యాప్తంగానున్న భారతీయులందరికీ ఆరాధ్యుడాయన.

అందుకే ఆయన సందేశం యువతరానికి శిరోధార్యమైంది. నూతనోత్తేజం వుప్పొంగుతోన్న నవీన యువతీయువకులెంతోమంది ఉవ్వెత్తునెగసిపడే పోరాటోత్సాహంతో ప్రాణాలకు సైతం విలువనివ్వక ఉరుకులెత్తి వచ్చారు. అలా వచ్చినవారిలో ఎస్.ఆర్. పాల్ నేతాజి ప్రతినిధిగా బర్మాకొచ్చారు. అప్పుడే నేను హింద్‌పాజ్‌లో చేరాను.

**ప్ర. నేతాజీని మిరెప్పుడైనా కలిసారా?**

జ. లేదు, ఆనాటి పరిస్థితుల్లో అంతటి అవకాశం లేదు. నిరంతరం ఆయన ప్రాణాలకి ముప్పుపొంచి వుండేది. కానీ, 1942లో జపాన్ సేనలకు సింగపూర్ లొంగిపోయాక నేతాజీ దేశవిముక్తికై కదిలిరావాలని యువతనుద్దేశించి చేసిన అద్వితీయ ప్రసంగాలను నన్ను నేను మర్చిపోయి మరీ విన్నాను. ఆయన మాటల్లోని వేడిని ఒక్కసారి తనివితీరా అనుభవించిన వారెవరైనా మర్చిపోవడం దుర్లభం. ఆ ఉత్తేజభరిత ఉపన్యాసాలు నన్నెంతగా ఉద్రేకపరిచాయంటే, అప్పటికప్పుడు ఆజాద్ హింద్ ఫౌజ్‌లో రిక్రూటింగ్ ఏజెంట్‌గా జాయినవ్వడమేకాక ఇంటికి పంపుదామని చాలారోజులుగా కూడబెట్టుకున్న 20,000 రూపాయల డబ్బును కూడా వెంటనే విరాళంగా ఇచ్చేసాను.

**ప్ర. ఆజాద్ హింద్ పౌజ్‌లో మీ రేయే బాధ్యతలు నిర్వహించేవారు?**

జ. తొలిదినాల్లో ఎస్.ఆర్. పాల్‌గారి ఆధ్వర్యంలో సమర్ధులైన ఎంతోమంది యువతను రిక్రూట్ చేసుకునే కార్యక్రమాన్ని చేపట్టాను. నా సారధ్యంలో ఎంతోమంది యువకులు నేతాజీ నాయకత్వానికి జేజేలు పలికి సైనికులుగా మారిపోయేవారు. ఆరేడు భాషల్లో అనర్గళంగా ఉపన్యసించడం అభ్యసించి ఎంతోమంది వీరుల్ని సైన్యంలోకి సమీకరించగలిగాను. దేశం కోసం అంతమంది వీరసైనికులు సొంత కుటుంబాన్ని వదిలి సమరభూమికేగుతుంటే ఆగలేక నేనూ కదనరంగంలోకి దూకి రైఫిల్‌మాన్‌గా బాధ్యతలు చేపట్టాను.

**ప్ర. యుద్ధంలో మీ అనుభవాలేమైనా చెప్పగలరా?**

జ. కళ్ళు బైర్లు కమ్మే నల్లని పొగల మధ్య చెవులు చిల్లులుపడే ఆయుధాల హోరులోంచి ఎటువైపు నుంచి దూసుకొస్తాయో తెలీని శత్రు తూటాల వేట నడుమ ఎప్పుడెలా నెత్తిమీద పడతాయో అనే బాంబుల ఉత్కంఠతో ఊపిరిపై

సైతం పహారా కాసే అటువంటి ప్రమాదకర వాతావరణంలోంచి బతికి బట్టకట్టడాన్ని మించిన దివ్యానుభవంకంటే మించినదేముంటుంది?

**ప్ర. ఆ తర్వాత ఏమయ్యింది?**

జ. ఏముంది? **1945** ఏప్రిల్‌లో జపాన్ వోడిపోయింది. ఆజాద్ హింద్ ఫౌజ్ కూడా పరాజయం పాలైంది. నేతాజీ స్వయంగా ఓటమినంగీకరించాడు. ఆ క్లిష్ట పరిస్థితుల్లో ఎవరికి వారు సురక్షిత ప్రదేశాలకు చేరుకోవటం తప్ప మరేదారీ కనిపించలేదు. నా కథ మళ్ళీ మొదటికొచ్చింది. ఏం చేయాలో తెలీక తెలిసిన పన్లన్నీ చేసాను. పొట్టచేత పట్టుకుని అనేక ప్రాంతాలు తిరిగాను. దొరికిన పనల్లా చేస్తూ, చివరికి **1947**లో ఇండియా వచ్చేసాను.

**ప్ర. ఇక్కడెంత కాలం ఉన్నారు?**

జ. ఎంతోకాలం వుండే పరిస్థితి కనిపించలేదు. ఉత్తచేతులతో స్వగ్రామం చేరుకున్న నాకు ఆదరణే కరువైంది. మూడునెలలు ఎలాగో నెట్టుకొచ్చిన నాకు ఇక్కడి వాతావరణం నచ్చక తిరిగి బర్మా వెళ్ళిపోయాను. అక్కడే స్థానిక యువతి ఫాతిమాను **1948** డిసెంబరులో వివాహం చేసుకుని పదిమంది పిల్లల్ని కన్నాను. బర్మాలోనే కిరాణాషాపు పెట్టుకుని చాలాకాలం జీవనయానం సాగించాను.

**ప్ర. అప్పుడేవైనా కార్యక్రమాల్లో పాల్గొన్నారా?**

జ. వివిధ స్వచ్ఛంద సేవా సంఘాల్లో క్రియాశీలక పాత్ర పోషించాను. హయాతుల్ ఇస్లాం మదర్సా, ఆల్ బర్మా యిండియన్ కాంగ్రెస్, ఆంధ్రా యంగ్‌మెన్ రీడింగ్ సొసైటీ, మల్బార్ ముస్లిం అసోసియేషన్ మొదలగు సంస్థల్లో అధ్యక్షుడిగా, కార్యదర్శిగా అనేక బాధ్యతలు చేపట్టాను. సుమారు **15** సంవత్సరాలబాటు వివిధ స్వచ్ఛంద సంఘసేవా కార్యక్రమాల్లో నేనూ తప్పనిసరి భాగమయ్యాను.

**ప్ర. మరి, మళ్ళీ యిండియాకు ఎందుకొచ్చేసారు?**

జ. రాలేదు, రావాల్సొచ్చింది. **1964**లో బర్మాలో ఏర్పడిన రాజకీయ సంక్షోభం అక్కడ బతుకుతున్న విదేశీయుల ప్రాణాలపైకి తెచ్చింది. ప్రధాన సైనికాధికారి ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకుని విదేశీయులకు వ్యతిరేకంగా ఆజ్ఞలు జారీ చేసాడు.

ఆ దెబ్బతో ఇక తప్పనిసరై అందర్లాగానే నేనూ మళ్ళీ కాళ్ళీడ్చుకుంటూ వేపాడొచ్చాను. భార్యాపిల్లల్ని పోషించడమెలానో తెలీక టీ కొట్టొకటి పెట్టుకున్నాను.

**ప్ర. మరి, ప్రభుత్వం మిమ్మల్ని ఆదుకోలేదా?**

జ. కనీసం నా అస్తిత్వాన్ని కూడా గుర్తించలేదు. 1972లో ఇందిరాగాంధీ రష్యా వెళ్ళినప్పుడు భారద్దేశ స్వతంత్ర్యం కోసం పోరాడిన వారినెలా ఆదుకుంటున్నారనే ప్రశ్న ఎదురై తిరిగొచ్చి పార్లమెంటులో బిల్లు పెట్టింది. స్వాతంత్ర్యోద్యమకారులకి ఆ విధంగా కాస్త చేయూత లభించింది. కానీ, అవేవీ నాకు దక్కలేదు. ఎంతోమంది ముఖ్యమంత్రులకూ, ప్రధానమంత్రులకూ, రాష్ట్రపతులకూ, గవర్నర్లకూ లెక్కలేనన్ని అర్జీలు రాసినా నువ్వింకా బతికే ఉన్నావా అంటూ ఒక్కరంటే ఒక్కరు కూడా అడిగిన పాపాన పోలేదు. ఎంతోమంది అధికారుల చుట్టూ కాళ్ళరిగేలా తిరిగినా కనికరించలేదు.

**ప్ర. చివరికి ఏం చేసారు?**

జ. పరాయి దేశంపై పోరాడి వచ్చినవాడ్ని మాతృభూమిలో జరుగుతున్న ఘోరాల్ని తట్టుకోలేకపోయాను. ఎట్టకేలకు ధైర్యం చేసి రుజువుల్తో న్యాయస్థానాన్ని ఆశ్రయించానో లేదో నా కేసును స్వీకరించి అధికారుల్ని మొట్టికాయులమొట్టి, పాలకులకు చీవాట్లుపెట్టి ఇప్పటికే నాకు చాలా అన్యాయం జరిగిందని ప్రకటించీ 'స్వతంత్ర సైనిక్ సమ్మాన్' వర్తింపజేయాలని ప్రభుత్వం మొహం వాచేలా కోర్టు తీర్పిచ్చింది. ఆ తీర్పును అనుసరించీ 1998 నుంచీ నాకు స్వాతంత్ర్య సమరయోధునిగా పరిగణిస్తూ ఆర్థికంగా వెసులుబాటు కల్పించడమేకాక కొన్ని సదుపాయాల్ని కూడా కల్పించడం జరిగింది.

**ప్ర. మీ కాలానికీ, ఈ కాలానికీ మీరు గమనించిన మార్పులేవి?**

జ. నీతీ నిజాయితీలనే పదాలు అనడానికీ - వినడానికే కానీ ఆచరించడానికి నోచుకోనివై పోయాయి. ఏదో ప్రజలకు మంచి చేద్దామనే వుద్దేశంతో కొంతకాలం స్థానిక రాజకీయాల్లో పాలుపంచుకున్నప్పటికీ కుటిల రాజకీయాల్ని చూసి తట్టుకోలేక తప్పుకుని ఏదో తోచిన సేవా కార్యక్రమాలు చేపడుతున్నా.

**ప్ర. నేతాజీ హిట్లర్‌ను ఆశ్రయించడంపై వచ్చే విమర్శలపై ఏమంటారు?**

జ. ఆయన బహుముఖ మేధావి, అపార ప్రజ్ఞావంతుడు, రాగద్వేషాలకు లోనుకాగల మనలాంటివారి ఆలోచనలకు అతీతమైంది ఆయన వ్యక్తిత్వం. బ్రిటీష్‌వారికి వ్యతిరేకంగా దేశవిముక్తికోసం హిట్లరు సాయం కోరాడే కాని ఫాసిజాన్ని సమర్థిస్తూ కాదు.

**ప్ర. నేతాజీ అదృశ్యంపై వెలువడుతున్న వార్తల గూర్చి మీ భావన?**

జ. రవి అస్తమించని బ్రిటీష్ మహాసామ్రాజ్యపు కళ్ళుగప్పి దాని భల్లూకపు పట్టునుంచి తప్పించుకుని దేశ సరిహద్దులు దాటి భారద్దేశ స్వతంత్ర నినాదాన్ని ప్రపంచానికంతటికీ వినిపించిన అపూర్వ వీరుడాయన. ఆయన జీవిత విశేషాలు యువతకు ఆదర్శం కావాలే గాని స్వప్రయోజనాల కోసం వివాదాస్పదం కారాదు.

**ప్ర. చివరిగా, మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. "ఇన్సాన్ యిన్సాన్ జేసా నహీతో మర్‌నాహి అచ్ఛాహై" (మనిషి మనిషిలా జీవించలేనప్పుడు మరణించడమే మంచిది) అని నేతాజీ అనేవారు. నాకిప్పుడు 90 సం॥రాలు. కులమత కుళ్ళుతో, డబ్బూ, పదవీ కంపుతో నిండిన సమాజాన్ని ప్రక్షాళన చేయడానికి యువత ముందుకు రావాలి. వారిలో నిద్రాణమైయున్న శక్తియుక్తుల్ని వెలికితీసి సామాజిక హితానికి వుపయోగించాలి. నేతాజీ కలలుకన్న ఆదర్శ భారతావనికై అందరం పాటుపడాలి. జైహింద్



## ప్రత్యామ్నాయ విద్యావిధాన రూపకర్త

# పి.డి.కె. రావు గారి

## (చీపురుపల్లి) ఇంటర్వ్యూ



**ప్ర. మీ చిన్ననాటి విషయాలు, కుటుంబ వివరాలు చెప్పండి?**

జ. మా పూర్వీకులది పశ్చిమగోదావరి జిల్లా ఆచంట దగ్గర్లోని వల్లూరు గ్రామం. అయితే నాన్నగారి ఉద్యోగరీత్యా అనేక ప్రాంతాల్లో ఉండాల్సి రావడంతో నలుగురన్నదమ్ములం, ఇద్దరక్కాచెల్లెళ్ళు ఒక్కొక్కరం ఒక్కోచోట పుట్టాం. అలా నేను విజయవాడలో జన్మించాను. చిన్నప్పుడు నేను బాగా బలహీనంగా అనారోగ్యంతో వుండేవాడ్ని. తరచూ ఉబ్బసంతో బాధపడుతూండటం మూలాన నాకు తొమ్మిదేళ్ళు వచ్చేంతవరకూ స్కూలుకి కూడా వెళ్ళలేదు. ఆ తర్వాత ఫస్టుఫారంలో చేరి ఎలాగో గట్టెక్కాను.

**ప్ర. అణుభౌతికశాస్త్రం పట్ల ఆసక్తెలా కలిగింది?**

జ. మా నాన్నగారి ప్రభావం మొదట్నుంచీ మామీదుంది. స్వతహాగా ఆయనెంత కోపిష్టి అయినప్పటికీ పిల్లలతో మాత్రం చాలా మురిపెంగా వుండేవారు. అంతమంచి తండ్రిగా ఆయనెలా ప్రవర్తించగలిగేవారోనని నాకిప్పటికీ ఆశ్చర్యం వేస్తుంది. అలా పిల్లలందరికీ స్వేచ్ఛగా నిర్ణయాలు తీసుకునే అవకాశం కలిగింది. నాకు 16 ఏళ్ళున్నప్పుడనుకుంటా, రష్యా దేశం నుంచి స్పుత్నిక్ అంతరిక్షంలోకి వెళ్లడం గురించి విని ఎందుకనో తబ్బిబ్బయిపోయాను. అప్పటికప్పుడే ఎలాగైనా అమెరికావెళ్ళి న్యూక్లియర్ ఫిజిక్స్‌లో చేరాలనుకున్నా. అలా దేశం మొత్తమ్మీద 13 మందిని మాత్రమే ఎంపికచేసే 'సహా అసోసియేట్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ న్యూక్లియర్ ఫిజిక్స్'కి ఎంపికై ఒక సం॥రం పాటు చదివి తర్వాత అమెరికాలోని బోస్టన్ యూనివర్శిటీలో లెక్చరర్‌గా చేరాను.

**ప్ర. అప్పటి మీ అనుభవాలేమైనా చెప్పగలరా?**

జ. ఆ కాలంలో అమెరికా అట్టుడికిపోతోంది. ఉద్యమాలతో దద్దరిల్లిపోతోంది. యాంటీ వియత్నాం వార్ మూమెంట్, బ్లాక్స్ మూమెంట్, హిప్పీమూమెంట్‌లని చాలా దగ్గరగా పరిశీలించాను. అలాగే ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా 'ఇండియన్స్ ఎగైనస్ట్ ఎమర్జెన్సీ', 'ఇండియన్స్ ఫర్ డెమోక్రసీ' మొదలయిన సంఘాల్లో నేనో భాగస్వామిగా వుండేవాడ్ని. ఇండియా అబ్రాడ్ పత్రికలో రచనలు సైతం చేస్తుండేవాడ్ని. విస్మరణీయ వర్గాల గురించిన బాధ్యతాయుతమైన స్పృహ బహుశా అప్పట్నుంచే నాలో తలెత్తిందేమో.

**ప్ర. మీ సామాజిక సేవా దృక్పథానికి భూమిక అదేననుకోవచ్చా?**

జ. చిన్నప్పట్నుంచే ఒక విధమైన అభద్రతాభావం నాకుండేది. తరగతి గదిలో మంచి విద్యార్థిగా ఉన్నప్పటికీ అణగారిన వారిపట్ల అంతర్గతంగా ఏదో తెలీని అసంతృప్తి, మానసిక వేదన నిరంతరం కుదిపేసేవి. బోస్టన్‌లో నేనున్నప్పుడే అనుకోకుండా వోసారి జిడ్డుకృష్ణమూర్తిగారి ఉపన్యాసాల పుస్తకం కంటబడింది. అది నన్నెంత ప్రభావితం చేసిందంటే, తర్వాత కాలంలో కృష్ణమూర్తిగారి ప్రసంగాలు చాలావాటికి నేను హాజరయి ఆసక్తిగా వినేవాడ్ని. అలా బోస్టన్‌లో 4 సం॥రాలు పనిచేసాక నా కార్యక్రమాల్ని గమనిస్తూ వస్తున్న యూనివర్శిటీ యంత్రాంగం నా ఉద్యోగానికి ఉద్వాసన చెప్పాలని నిశ్చయించారు.

**ప్ర. మరప్పుడు ఏం చేసారు?**

జ. ఏం చేస్తాను? మరో నీడకోసం దేవులాడ్డం మొదలెట్టాను. అలా న్యూజెర్సీలోని 'రట్జర్స్ యూనివర్శిటీ'లో మొత్తానికి ఉద్యోగం సంపాయించ గలిగాను. నా జీవితంలో అప్పటి రోజులెంతో ముఖ్యమయినవి. ఆ కాలంలోనే విపరీతంగా చదివాను. మనో వైజ్ఞానిక శాస్త్రం, సామాజిక శాస్త్రం, మత శాస్త్రం, తర్కశాస్త్రం, తత్వశాస్త్రం, రాజనీతి శాస్త్రం... ఇలా అన్నింటినీ దాదాపు ఔపోశన పట్టాను. అక్కడున్న 7 సం॥రాలలో ఎక్కువశాతం నిద్రలేని రాత్రులే గడిపాను. సంవత్సరాల్నుంచీ నాలో సాగుతోన్న సంఘర్షణకి ఏదోక సమాధానం నిజాయితీగా వెతక్కుండా ఇక కాలం వెళ్ళదీయలేనని తెలుసుకున్నాక ఆ సందిగ్ధతకు

తెరపడింది. అస్పష్టత నుంచి స్పష్టత వచ్చింది. అంతే, ఇక ఎటువంటి మీమాంసకూ తావివ్వకుండా నా మాతృభూమికి బయలుదేరాను.

**ప్ర. ఇక్కడికొచ్చాక మీ కార్యక్రమాల్ని ఎలా మొదలెట్టారు?**

జ. ఎలా మొదలెట్టాలో తెలీక చాలాకాలం మథనపడ్డాను. దేశమంతా విస్తృతంగా పర్యటించాను. ఎంతోమంది మేధావుల్నీ, విజ్ఞానవేత్తల్నీ కలిసాను. శ్రీలంకలోని హీనయాన బౌద్ధారామాలు మొదలుకునీ శ్రీకాకుళంలోని హీనంగా కనిపించే మారుమూల గ్రామాల వరకూ పిచ్చిపిచ్చిగా తిరిగాను. ఆచార్య వినోభాజీనీ, లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్‌నీ కల్సి చర్చించాను. ఇద్దరూ ఒకటే సలహా ఇచ్చారు. ఒక సంవత్సరంపాటు పేదవాడల్లో అతిబీదపేటల్లో మొక్కుబడిగా కాక ప్రజల్తో మమేకమై జీవించమన్నారు. మాటలు మాని చేతల్లో చేవ పెంచుకోమన్నారు. అదే నా పాలిట గీత, బైబిల్, ఖురాన్, గురుగ్రంథ్‌సాహెబ్... ఇంకా అన్నీ.

**ప్ర. మరి, ఈ ఉత్తరాంధ్ర ప్రాంతాన్నే ఎందుకు ఎంచుకున్నారు?**

జ. వినోభా, జె.పి.ల సలహాతో చాలాకాలంపాటు క్షేత్రస్థాయిలో మన గ్రామీణ ప్రాంతాల పరిస్థితుల్ని అధ్యయనం చేసాక ఎక్కడ్నుంచి మొదలెట్టాలనే విషయమై అప్పటి ఐఎఎస్ అధికారి మోహన్ కందాగార్ని కలిసాను. అప్పుడాయన అన్ని రకాలుగా వెనకబడిన ఆదిలాబాద్, శ్రీకాకుళం జిల్లాల్లో ఏదోటి ఎంపిక చేసుకోవాల్సిందని సూచించారు. ఆదిలాబాద్‌లో ప్రభుత్వ యంత్రాంగం అందుబాటులో వుండేది కాదు. ప్రభుత్వ కార్యాలయాలు సదుపాయంగా వుండేవి కావు. తర్వాత చీపురుపల్లి వచ్చాను. ఇక్కడ 70% దళిత జనాభా కలిగిన అప్పన్న వలస గ్రామం నుంచీ కార్యాచరణ మొదలెట్టాలని నిర్ణయించుకున్నా.

**ప్ర. మీ వ్యక్తిత్వంపై ఎవరెవరి ప్రభావం వుంది?**

జ. గాంధీ, జిడ్డు కృష్ణమూర్తి, ఇవాన్ యిల్లిచ్, రమణ మహర్షి మొదలగువారి రచనల్తో బాగా ప్రభావితమయ్యాను. గాంధీగారి మరణవార్త విని మా కుటుంబమంతా ఉపవాసముండీ, ఆయన అస్తికల్ని కృష్ణలో కలిపేందుకు జరిగిన ఊరేగింపులో మా అమ్మతోబాటు నేనూ పాల్గొన్న జ్ఞాపకం ఇప్పటికీ నా స్మృతిపథంలో స్పష్టంగా వుంది.

**ప్ర. మీరేయే కార్యక్రమాలు చేపట్టారు?**

జ. చాలా ఉన్నాయి. ప్రతి ప్రజాసమస్య మీదా దృష్టి పెట్టాను. బ్యాంకు రుణాల పేరిట పేదల సొమ్ము తినేసిన అధికారుల నిర్వాకాన్ని ఆధారాల్తో బయటపెట్టా. అలాగే గ్రామీణుల వెనుకబాటుతనానికి అవిద్య ముఖ్య కారణమని అర్థం చేస్కొని రాత్రిబడులు నిర్వహించాను. మహిళల చేత పొదుపు సంఘాల్ని పెట్టించా. బీదల భూమిని అడ్డంగా మింగేసిన భూబకాసురుల చెరలోంచి సుమారు 500ఎకరాల భూముల్ని విడిపించి పేదలకు న్యాయం చేసాను. ప్రజల పేదరికానికీ, వెనుకబాటుతనానికీ మద్యపానం ప్రధాన కారణమని గుర్తించి అనేక గ్రామాల్ని సంఘటితపర్చి మద్య వ్యతిరేకోద్యమాన్ని నిర్మించాం. అలాగే ఎస్.ఆర్. శంకరన్‌గారి సహకారంతో ఆసియాలోనే మొట్టమొదటి రిక్షా కార్మికుల కాలనీని నిర్మించడం జరిగింది. స్వాతంత్ర్య సమరయోధులు వావిలాల గోపాలకృష్ణయ్యగారితో దీన్ని ప్రారంభించి చరిత్ర సృష్టించాం.

**ప్ర. మీ బాలబడి విద్యావిధానం గురించి చెప్పరా?**

జ. అక్కడికే వస్తున్నా. అక్షరాస్యతను అధ్యయనం చేస్తున్న క్రమంలోనే పూర్వ ప్రాథమిక విద్యని పటిష్టం చేయకుండా ప్రాథమిక విద్య విజయవంతం కాదని తెలిసొచ్చింది. స్కూలంటే అదేదో ఎంపిక చేసిన శిక్షల్ని క్రమపద్ధతిలో అమలుచేసే కసాయిగృహమనే ఆలోచనే ఎక్కువమంది పిల్లల్ని బాధించడం గమనించాను. ఆ పరిస్థితుల్లోనే ప్రపంచంలోని విద్యావిధానాలన్నింటినీ క్షుణ్ణంగా పరిశీలించి ప్రత్యామ్నాయ విద్యావిధానాన్ని ముఖ్యోద్దేశంగా చేస్తూ బాలబడనే పద్ధతిని రూపొందించాను. పుస్తకాల మోతలు, హోంవర్కు రాతలు లేని ఆటపాటల ఆనంద విద్యాలయమిది. "ఇలాంటి విద్యావిధానం నా బాల్యంలోనే వుంటే, నేనీనాటికంటే గొప్ప అధ్యాపకుడిని అయ్యేవాడిని" అన్నారు సుప్రసిద్ధ కథకులు కాలిపట్నం రామారావుగారు. రాష్ట్రంలోని అంగన్‌వాడీలు మొదలుకుని ఇతర రాష్ట్రాల్లోని ఆశ్రమ విద్యాలయాలు, ప్రైవేటు కళాశాలలు, కార్పోరేటు విద్యాసంస్థలు సైతం బాలబడిని స్ఫూర్తిగా తీసుకొంటున్నాయంటే 35 సం॥రాల నిరవధిక కృషికి దక్కిన విజయమది. ఆ క్రమంలోనే మా కార్యక్రమాలకు 1983లో 'శోధన' అని నామకరణం చేసాం.

**ప్ర. ఈ క్రమంలో మీకెదురైన ఆటంకాలేమైనా ఉన్నాయా?**

జ. ఆర్థికంగా ఎన్ని అడ్డంకులొచ్చినా ఎప్పుడూ ఎవర్నీ చేయిచాచి అడగలేదు. తప్పనప్పుడు ఒక్కొక్కటిగా ఆస్తులమ్ముకున్నానేకాని ఆత్మనమ్ముకోలేదు. ఇక నాపై వొచ్చిన నిందలకు కొదవలేదు. నక్సలైట్‌నని వేధించారు. ఎన్నో అబద్దాల్ని ప్రచారం చేసారు. సుమారు పాతిక తప్పుడు కేసుల్ని బనాయించారు. భౌతికదాడులూ జరిగాయి. అలాంటప్పుడు ప్రజలే అండగా నిలిచారు. నలుగురికీ ఎంతో కొంత మంచి చేయాలనే నా పట్టుదలకి ఇలాంటివాట్ని పట్టించుకునే తీరికుండదు.

**ప్ర. ఇక, చివరిగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ. నాకిప్పుడు 75 సం॥రాలు. నా సామాజిక స్పృహకి అడ్డమొస్తుందని వివాహం కూడా చేసుకోలేదు. నా తర్వాత ఈ కృషిని కొనసాగించే యువతకోసం ఎదురుచూస్తున్నా. ఈనాటి పరిస్థితి అందుకనుగుణంగా లేదు. కార్పోరేట్ సంస్కృతికి ఆకర్షితులవుతోన్న యువతరం వినాశకరమయిన వెలుగుజిలుగుల వెంబడిపడి చివరికి లైటుపురుగుల్లా మాడిపోతున్నారు. ముఖ్యంగా మధ్యతరగతి ప్రజల కంఫర్ట్ జోన్‌ని పాలకులూ, పెత్తందారులూ పెంచారు. అర్థంకాని సుఖాల సుడిగుండాల్లో వార్ని ముంచెత్తుతుండటం మూలాన, వారిప్పుడు వుద్యమాలు చేసే స్థితిలో లేరు. ఈరోజు స్వార్థం వొదిలి త్యాగంతో సహవాసం చేస్తున్న నక్సల్స్ అవసరం అడవిలోకంటే సమాజంలో ఎక్కువుంది. అన్ని సమస్యలూ ఆయుధంతోనే కాక ప్రజల్లో ఆత్మవిశ్వాసం నింపడం వల్ల కూడా కొన్ని సమస్యలు పరిష్కరించబడతాయనే నిజాన్ని వారు గ్రహించి ప్రజల్లో పనిచేయడానికి సిద్ధపడినప్పుడే మార్పొస్తుంది.



## ప్రముఖ గాంధేయవాద రచయిత

## గారి

## (రాజమండ్రి) ఇంటర్వ్యూ



**ప్ర. మీ రచనా వ్యాసంగం గురించి చెప్పండి?**

జ. నా కుటుంబం గురించి చెప్పకుండా రచనా వ్యాసంగం ప్రస్తావన అప్రస్తుతమవుతుంది. ఎందుకనో మీకర్థం కావాలంటే మొదట్నుంచీ మొదలెట్టాలి.

**ప్ర. సరే, అలాగే మీరన్నట్టే కానీండి?**

జ. **1941** సెప్టెంబరు **29** విజయదశమి నాడు రాజమహేంద్రవరంలో పుట్టిన నాకు చిన్నప్పట్నుంచే సాహిత్యంపై వల్లమాలిన ప్రేముండేది. మా అమ్మగారైన కోడూరి లీలావతీదేవిగారు స్వయంగా ప్రసిద్ధ రచయిత్రి కావడమూ, బాల సాహిత్యంలో ఎంతో కృషి చేయడమే కాక శాస్త్రీయ సంగీతంలో సైతం మంచి నైపుణ్యం వుండటంతో ఆమె వ్యక్తిత్వ ప్రభావం నాపై పడి చిన్నప్పటినుంచే చిన్న చిన్న కథలూ, తోచిన నవలలూ రాస్తుండేవాడ్ని.

**ప్ర. అంటే అప్పటికే రచయితైపోయారన్నమాట?**

జ. ఇంకా పూర్తిగా కానేలేదు, అప్పుడే పోవడమెట్లా? నిజానికి ఏదో పిచ్చిగా రాసేవాడ్నే కానీ అవెవరికీ, చివరికి మా అమ్మకీ, నాన్నగారైన కోడూరి పుల్లేశ్వర్రావుగారికీ ఎప్పుడూ చూపించలేదు. మా అమ్మకు పాప, అంటే నాకు చెల్లెలు పుట్టింది. సహజంగానే ఆ పసిపాపపై అందరికీ ఆత్రుతా, అభిమానం కలిగాయి. ఆ వయసులో దాన్ని అర్థం చేసుకోగల ప్రజ్ఞ నాకు లేకపోవడంతో చెల్లిపై కుటుంబ సభ్యులు కురిపిస్తున్న ప్రేమ చూసి అసూయ కలిగేది. అభిమానం దెబ్బతినేది. నా ప్రాధాన్యత తగ్గుతున్నట్లనిపిస్తూ, దానికి కారణం చెల్లే అనుకునేవాడ్ని. ఆ ఆలోచనతోనే 'నేనూ-నాచెల్లెలు' అనే స్కెచ్ రాసాను. తర్వాత మా అమ్మగారికి సాహిత్య అవార్డొచ్చిన సందర్భంగా ఏర్పాటు చేసిన సన్మాన

సభలో నేను రచయితనని బయటపడింది. అప్పట్నుంచీ స్థానిక పత్రికల్లో నా రచనలు రావటం మొదలైంది.

**ప్ర. మరి మీ మీద గాంధీగారి ప్రభావమెలా పడింది?**

జ. మాది మొదట్నుంచీ దేశభక్తియుత కుటుంబం. మా తాతగారైన దేవతా శ్రీరామ్మూర్తిగారు (ఆయన పేరే నాకు పెట్టారు) గొప్ప దేశభక్తులు. ప్రఖ్యాత న్యాయవాదిగా పేరుపొంది రెండు చేతులా సంపాదిస్తున్న రోజుల్లోనే గాంధీగారి పిలుపందుకుని న్యాయవాద వృత్తిని విడనాడి స్వాతంత్ర్యోద్యమంలోకి దూకారు. బ్రిటీష్‌వారంటేనే బెంబేలెత్తిపోయే ఆ రోజుల్లో బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా ఇంటిపై జాతీయ జెండా ఎగరవేయగా, మహా క్రూరుడిగా పేరొందిన ముస్తఫలీఖాన్ అశ్విక దళంతో వచ్చి వారితో వాగ్వాదం పెట్టుకుని అప్పటికప్పుడు కలెక్టరుగారి నుంచి వారెంటు తీసుకొచ్చి మరీ ఆ జెండా పీకి పారేయగా, మా తాతగారు హైకోర్టులో కేసుపెట్టి స్వయంగా వాదించి అప్పట్లో సర్దార్ పటేల్ కేసులో సుప్రీంకోర్టు చెప్పిన తీర్పుని ఉదహరిస్తూ 'జెండా ఎగరేయడం నా హక్కు'ని నినదించడంతో జెండా ఎగరేసుకునేందుకు అనుమతించడం జరిగింది. అది విని యావత్ రాజమహేంద్రవరము పరవశించిపోయింది. ప్రతి యిల్లూ మువ్వన్నెల జెండాతో కళకళలాడింది. ఈ సంఘటన గురించివిని పులకరించిపోయిన గాంధీజీ ఇటువైపొచ్చినప్పుడు మా తాతగారింట్లోనే వుండేవారు. ఇది జరిగిన తర్వాత మా తాతగార్ని ఊర్లో అంతా జెండా ప్లీడరని పిలిచేవారు. గాంధీ, నెహ్రూ, సుభాష్ చంద్రబోస్, రాజేంద్రప్రసాద్ వంటి మహామహులు మా ఇంట్లోనే వుండేవారు. నేతాజీ సుభాష్‌చంద్రబోసుగారికీ మా తాతగారికీ చాలా స్నేహం ఉండేది. ఆయన అజ్ఞాతంలోకి వెళ్ళబోయే ముందు కూడా రాజమండ్రిలో కొన్నాళ్ళున్నాడు. ఆ సమయంలో మా తాతగారితో నేతాజీ కలిసి తీయించుకున్న ఫోటో ఇప్పటికీ నా దగ్గర భద్రంగా వుంది.

**ప్ర. అంటే అప్పట్నుంచే మీకు గాంధీగారి పట్ల అభిమానముండేదా?**

జ. అవును. 1961లో ఠాగూరు శతజయంత్యుత్సవాన్ని ప్రభుత్వం ఘనంగా జరిపించతల్చి 14 భాషల్లో పిల్లలకోసం ఠాగూరు జీవితంపై గ్రంథం రాయాల్సిందని పోటీపెట్టగా, ఎందరో ప్రొఫెసర్లతో పోటీపడి నేను రాసిన పుస్తకం ఎంపికైంది. ఆ సన్మాన సభలో నన్ను చూసిన అప్పటి ముఖ్యమంత్రి సంజీవయ్యగారు మొదట

ఆ పుస్తక రచయితను నేనంటే నమ్మలేదు. తర్వాత పరమానందభరితులై నాతో ప్రత్యేకంగా ఫోటోలు తీయించుకున్నారు. అప్పటికి నా వయస్సు 19 ఏళ్ళు. ఆ సందర్భంగా నేను గెల్చుకున్న 2232/- రూపాయిలు తర్వాత నా ఎమ్.ఏ. చదువుకి సరిపోయాయి. ఆ పోటీల్లో పాల్గొని నెగ్గినవారిలో దేశవ్యాప్తంగా నేనే చిన్నవాడ్ని. అప్పటికే గాంధీ-ఠాగూర్‌ల రచనలతో నాకు మంచి పరిచయమే కాదు పరిజ్ఞానం కూడా ఉండేది.

**ప్ర. మరి, ఉద్యోగ జీవితమెలా మొదలయింది?**

జ. కొంతకాలం అమెరికన్ ఇన్ఫర్మేషన్ సర్వీసువారి ప్రోత్సాహంతో అనువాదాలు చేస్తుండేవాడ్ని. తర్వాత 'ఉదయరేఖ' అనే పత్రికను నడిపాను. ఎక్కువ నా రచనలే అందులో వుండేవి. జిల్లా జడ్జిగారైన మా మావయ్య కోర్టు ప్రకటన లిప్పించడంతో అదలా సాగిపోయేది. ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్‌లో ఉద్యోగం కోసం అప్లైచేస్తే ఆంధ్రప్రభ వీక్లీలో సహాయ సంపాదకుడిగా ఉద్యోగమిచ్చారు. మా అమ్మగారికి యిష్టం లేకపోవడం మూలాన జాయినవలేదు. తర్వాత బొబ్బిల్లో ఎకనామిక్స్ లెక్చరరుగా సుమారు 35 సం॥లు పనిచేసి రిటైరయ్యాను. గోదావరి తీరంలో వుండాలనే కోరికతో రాజమండ్రిలో ఇల్లుకొని ఉంటున్నాను.

**ప్ర. మీ సాహిత్యాభివృద్ధి ఉద్యోగకాలంలోనే జరిగిందా?**

జ. అవును. అప్పుడే కథా విమర్శకుడిగా రాష్ట్ర వ్యాప్తంగా పేరొచ్చింది. అనేక పత్రికల్లో నా రచనలుండేవి. నా వ్యాసంలేని భారతి ఉండేది కాదంటే అతిశయోక్తి కాదు. సాహిత్యకారునిగా గుర్తింపొచ్చింది.

**ప్ర. మీ రచనల గురించి చెప్పండి?**

జ. 'గాంధీ కథావళి' పేర్తో ఆంధ్రజ్యోతిలో రాసిన 3 సం॥రాల సీరియల్ ఇప్పటికి ఆరేడుసార్లు పునర్ముద్రణ పొందింది. పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు దాని సంపాదకులు. ఈనాడు పత్రికలో వర్తమాన వ్యవస్థకి గాందేయవాదమెలా పరిష్కారమో సూచిస్తూ 50 వ్యాసాల్రాసాను. తర్వాత గాంధేయవాదాన్ని కూలంకుషంగా చర్చిస్తూ 8 పుస్తకాలు రాసాను. కనీసం 10 రాయాలనేది నా కోరిక. మరో రెండు పుస్తకాలు మెటీరియల్ సిద్ధంగా వున్నప్పటికీ అనారోగ్యం కారణంగా డ్రాఫ్టింగ్ కుదరటం లేదు. రెడ్డిరాజుల కాలంనాటి ప్రణయ కథాంశంతో

రాసిన చారిత్రాత్మక నవలకు కృష్ణాపత్రిక సిల్వర్ జూబ్లీ అవార్డొచ్చింది. 'తెలుగుతార' అనే నవల రూపవాణి అనే సినిమా పత్రికలో వచ్చి పాఠకుల్ని విశేషంగా ఆకట్టుకుంది. శ్రీకృష్ణదేవరాయ జీవితానికి సంబంధించిన కథాంశంతో రాసిన నవలది. అలాగే 'తెలుగు సాహిత్యంలో మనో విశ్లేషణ' అనే పుస్తకానికి సాహిత్య అకాడెమి అవార్డొచ్చింది. ఆ అంశంపై అప్పటికీ, యిప్పటికీ కూడా అదొక్కటే ప్రామాణిక గ్రంథం. అలాగే వెలుగూ-వెన్నెల, తెలుగుకథ-నాడూ-నేడూ అనే రచనలకు శ్రీ పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం ఉత్తమ సాహిత్య గ్రంథ పురస్కారాల్నివ్వడం జరిగింది. 'నీటిలో నీడలు' అనే నవల అమెరికాలోని వాషింగ్టన్ కాంగ్రెస్ లైబ్రరీలో ఎంపికచేసి వుంచిన బహుకొద్ది నవలల్లో ఒకటి. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా ఉన్నాయి. ఇప్పటికి 22 గ్రంథాల్రాసాను.

**ప్ర. ప్రస్తుత సమాజానికి గాంధీమార్గం ఎంతవరకూ అవసరం?**

జ. అవినీతి, అక్రమాలు, అన్యాయాలు, అసత్యాలు, అత్యాచారాలు విచ్చలవిడిగా తాండవిస్తున్న ఈ వ్యవస్థకు సరైన దిశానిర్దేశం చేయగలిగింది మహాత్ముని మార్గమొక్కటే. కాంగ్రెసువారు గాంధీని అమ్ముకున్నారు తప్పితే ఏనాడు నమ్ముకోలేదు. స్వాతంత్ర్యానంతరం ఆయన్నసలు పట్టించుకోలేదు. ఆ రోజుల్లో ఆయన 'నేనొక ఖర్చుపెట్టిన తూటాని' అనేవారు. యింకొంతకాలం ఆయనుంటే మరింత దిగజార్చేవారు. అందుకే ఆయన ఆలోచనలకు ఈరోజు దుర్గతి పట్టింది.

**ప్ర. గాంధీమార్గంపై వొచ్చే విమర్శలపై మీ స్పందన?**

జ. విమర్శలు రావాల్సిందే. సంవాదాలు లేవాల్సిందే. అవన్నీ ఉన్నప్పుడే సత్యాన్వేషణనేది నిక్కచ్చిగా జరుగుతుంది. వామపక్షవాదులు మొదలుకుని ఎంతోమంది గాంధీపై ఎన్నో విమర్శలు చేసారు. ఆయన బతికున్న కాలంలోనే అవాకులు, చెవాకులు పేలారు. ఐతే, అలాంటివన్నీ చివరకు ఎందుకూ కొరగాకుండా మిగిలిపోవాల్సొచ్చిందే కాని నిరూపించబడి నిలబడ్డది లేదు.

**ప్ర. మీ దృష్టిలో గాంధీ వారసులెవరు?**

జ. సత్యాన్వేషణా దృష్టికల ప్రతిఒక్కరూ ఆయనకు వారసులైనప్పటికీ ఆయన సమకాలీనంగా చూస్తే పటేల్ మాత్రమే ఆయన వారసుడంటా నేను. ఈ దేశానికి సోషలిజం పనికిరావొచ్చుననే కారణంతోనే నెహ్రూకి గాంధీ పగ్గాలప్పజెప్పాడు.

అదే కొంపముంచింది. నెహ్రూ మేధావే కాని దృఢచిత్తం కలవాడు కాదు, అందుకే విజయలక్ష్మి పండిట్ నెహ్రూని వో సందర్భంలో 'Prisoner of indecision' అంటారు.

**ప్ర. చివరిగా, గాంధీవాదానికి కాలం చెల్లిందంటే ఒప్పుకుంటారా, చెప్పండి?**

జ. గాంధేయవాదం చిరస్మరణీయం. ఈ దేశంలో పేదరికం పూర్తిగా పోయి స్వరాజ్యమొచ్చేంత వరకూ గాంధీబోధలు నిలిచే ఉంటాయి. ఆచరణాత్మకంగా చేసినదానినే చెప్పిన అరుదైన నాయకుడు గాంధీ. అందుకే ఆయనెప్పటికీ సజీవుడే, సదా మహాత్ముడే.



అరుదైన చరిత్ర పరిశోధకుడు

# సయ్యద్ నశీర్ అహ్మద్‌గారి

## (ఉండవల్లి) ఇంటర్వ్యూ



**ప్ర. మీ బాల్యం, కుటుంబ వివరాలు చెప్పండి?**

జ. నేను 1955 డిసెంబర్ 22న నెల్లూరు జిల్లా అల్లూరు తాలూకా పురిణి గ్రామంలో పుట్టాను. తండ్రి సయ్యద్ బీబీజాన్, తల్లి సయ్యద్ మీరా మొహిద్దీన్. మాది సామాన్య వ్యవసాయ కుటుంబం. నాలుగో తరగతి చదూతుండగానే నాన్న పోయారు. అప్పుడు కావలిలోని మా మేనమామ షేక్ పీర్ అహ్మద్‌గారి ఇంటి దగ్గరుండి చదూకుని 10వ తరగతి పూర్తిచేసా. తర్వాత గుంటూరుజిల్లా నర్సారావుపేటలో కాలేజీలో చేరాను. అదయ్యాక భోపాల్‌లో ఎమ్.కాం. చేసాను. ఇంతలో ట్రెజరీ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగమొచ్చింది.

**ప్ర. మరి, ప్రభుత్వ ఉద్యోగాన్నెందుకు వొదిలేసుకున్నారు?**

జ. రచనా వ్యాసంగమనేదొక వ్యసనం లాంటిది. ఒక్కసారి అంటుకుంటే వదులుకోవడమంత సులువు కాదు. సాహిత్య పిపాసతో 7వ తరగతిలోనే గేయాలు రాయడం ప్రారంభించాను. తర్వాత ఆపేస్తే ఆగిపోతుందనుకున్నాను. తీరాచూస్తే మరింత రాటుదేలింది. అందుకనే ఉదయం పత్రికలో సాధారణ విలేకరిగా ప్రవేశించి అంచెలంచెలుగా ఎదుగుతున్న కాలంలో ఇక జర్నలిజాన్నే వృత్తిగా స్వీకరించదల్చి వుద్యోగానికి రాజీనామా చేసేసాను.

**ప్ర. అప్పటికి మీకు పత్రికారంగంలో అనుభవం వుందా?**

జ. సామాజిక రంగం నుంచి విడివడి ప్రత్యేకంగా పత్రికారంగంలో సంపాదించదగ్గ అనుభవం ఏ విలేకరికీ ఏమీ ఉండదు. నేను ఇంటర్మీడియేట్ చదూతున్నప్పుడే మిత్రుడు వేదాంతం సీతావధానితో కల్సి 'భేరి', 'మరో ప్రపంచం' అనే లిఖిత మాసపత్రికలను నడిపేవాడ్ని. అదీగాక చిన్నతనం నుండే మదర్ థెరీసా, బాబా ఆమ్టేల వ్యక్తిత్వాలను అమితంగా అభిమానించేవాడ్ని. బహుశా

అందుకే బహుజనహితం కోరి కలాన్ని నడిపించాను. అలా ఉదయం పత్రికలో 7 జిల్లాలకు సమన్వయకర్తగా చేసా. తర్వాత 'వార్త' పత్రికలో కొంతకాలం చేసా. హేతువాదం, హేతువాదదర్శిని, వినియోగవాణి, సారె జహాఁసే అచ్ఛా ఇండియా మొదలగు పత్రికలకు వివిధ హెూదాలో సంపాదకత్వం వహించా. తర్వాత సిటీకేబుల్ నెట్‌వర్క్‌లో చాలాకాలం పనిచేసా.

**ప్ర. పరిశోధకుడిగా ఎందుకు అవతారమెత్తారు?**

జ. ఎత్తక తప్పలేదు. చిన్నప్పట్నుంచీ చరిత్రంటే పిచ్చి. చరిత్ర గ్రంథాల్ని అదే పనిగా చదివేవాడ్ని. సామాజిక స్పృహ కూడా బాగా ఉండేది. విద్యార్థిగా ఉన్నప్పుడే నర్సరావుపేటలో స్థాపించిన దక్షిణ భారతదేశ మొట్టమొదటి అంధ విద్యార్థుల పాఠశాలకెళ్ళి వారితో ఎక్కువ సమయం గడిపేవాడ్ని. ఆ క్రమంలో చిన్నప్పట్నుంచే పాఠ్యాంశాల వల్ల నా వయసులో కొన్ని ప్రశ్నలు తలెత్తేవి. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఒకరిద్దరి ముస్లిమ్‌ల ప్రస్తావన తప్పితే ఇంక ఏ వివరాలూ వుండేవి కాదు. ఈ దేశంలో జరిగిన అద్వితీయ అహింసా పోరాటంలో అసువులు బాసిన నా జాతిజనులే లేరా? అన ప్రశ్న నిరంతరం నన్ను వెంటాడి వేధించేది. రాత్రిబవళ్ళు కలవరబెట్టేది. ఆ కుతూహలంతో వెలికి తీయడం మామూలైపోయింది. 'The Role of Muslims in Indian Freedom Struggle' అనే శాంతిమనిరాయి గ్రంథం తప్ప అప్పటికి చెప్పుకోదగ్గ ప్రామాణిక రచనలేవీ ఏ భాషలోనూ అందుబాటులో లేవు. అప్పట్లో సత్తెనపల్లిలో మున్షీమస్తాన్ అనే స్వాతంత్ర్యోద్యమ నాయకుడికి జరిగిన సన్మానసభలో నేను చేసిన ప్రసంగం పలువుర్ని ఆకట్టుకుంది. ఎక్కువమందిని ఆశ్చర్యంలో ముంచింది. ఆ శ్రోతలిచ్చిన స్ఫూర్తే రాతదిశగా నన్ను నడిపించి గుంటూరు నుంచొచ్చే 'పరివర్తన' అనే పత్రికలో 'భారత స్వాతంత్రోద్యమం-ముస్లిం స్త్రీల పాత్ర' అనే ప్రసిద్ధ రచనకు ప్రేరేపించింది.

**ప్ర. అప్పుడెలాంటి స్పందనొచ్చింది?**

జ. అద్భుత కదలికొచ్చింది. వెనువెంటనే దాన్ని చిన్న కరపత్ర పొత్తంగా ప్రచురించాను. అంతే, ఇక వెనుదిరిగి చూడలేదు. విషయ సేకరణ కోసం దేశంలోని ప్రసిద్ధ గ్రంథాలయాలన్నీ తిరిగాను. వివిధ చారిత్రక ప్రదేశాలనూ, అనేక విశ్వవిద్యాలయాలను సందర్శించడంతోబాటు ఎంతోమంది ప్రముఖుల్నీ, జిజ్ఞాసువుల్నీ కలిసి చర్చించాను. చేసిన వృత్తుల్లోని అనుభవాన్ని ఉపయోగించుకుని అదేపనిగా పదేపదే పర్యటించాను.

**ప్ర. ఉద్యోగమొదిలి ఊర్లంబడి తిరుగుతూంటే కుటుంబ సభ్యులేమి అనలేదా?**

జ. విలేకరిగా వృత్తికి స్వస్తి చెప్పినప్పుడే కుటుంబంతో కూర్చుని చర్చించాను. జీవించడం కోసం మరణించాలా, మరణించినా జీవించాలా? అనేదే ప్రధాన ప్రశ్నగా మారింది. ధనసంపాదన కంటే గుణ సంపాదనే ముఖ్యమనీ, మనిషి కేవలం తన కోసమే కాక పదిమంది కోసం బతికినప్పుడే ఆ బతుక్కి అర్థముంటుందనే భావనతో వారి ప్రోత్సాహంతోనే కార్యరంగంలోకి దూకాను. నా భార్య షేక్ రమిజాబాను, కూతురు సయ్యద్ జాస్మిన్ అహ్మద్ ఇంక యితర కుటుంబ సభ్యుల ఆదరణే నన్ను నడిపిస్తోంది.

**ప్ర. ఇప్పటిదాకా ఎన్ని రచనలు చేసారు?**

జ. మొత్తం పది గ్రంథాలొచ్చాయి. మరో పది అముద్రిత గ్రంథాలు ప్రచురణకు సిద్ధంగా వున్నాయి. భారత స్వాతంత్ర్యోద్యమంలోని ముస్లింల పాత్రపై చాలా లోతుగా నిబద్ధతగా ఎంతో అధ్యయనం చేసి రాసిన అరుదైన గ్రంథాలే అన్నీ. అందుకే నా రచనలన్నీ పదులసార్లు పునర్ముద్రితమవుతున్నాయి. అలాగే చరితార్థులు పేర్తో 1757 నుంచీ 1947 వరకూ భారత ఉపఖండంలో సాగిన బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న 155 మంది ముస్లిం యోధుల అపురూప చిత్రపటాలతో ఇంతవరకూ ప్రపంచంలోనే ఇంతిదిగా రానిరీతిలో అద్భుతమైన ఆల్బమ్‌ను ఏ4 సైజులో సర్వాంగసుందరంగా ప్రచురించాం. ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్ తరఫున వీట్ని ముద్రిస్తున్నాం.

**ప్ర. చరిత్ర రచనలో వివక్ష ఉందని అంగీకరిస్తారా?**

జ. బొత్తిగా లేకపోలేదు కానీ చరిత్ర బయటకు రాకపోడానికి అదొక్కటే కారణం కాదనుకుంటాను. ముఖ్యంగా ఈనాటికీ ముస్లిమ్ సమాజంలోని అవిద్య, ఆత్మగౌరవలేమి, అంధ విశ్వాసాలే ఇందుకు కారణమంటాను.

**ప్ర. ముస్లింలని ఇప్పటికీ రెండో తరగతి పౌరులుగా చూసే వక్రదృష్టి ఈ దేశంలో ఎందువల్ల పెంపొందిందంటారు?**

జ. చేయని నేరానికి ముద్దాయిలుగా ముద్రవేయబడ్డ జాతి భారద్దేశ ముస్లింలది. దేశవిభజనకు ముస్లిములే కారణమన్న అసత్యం అన్ని ప్రాంతాల్లోనూ నరనరాన

జీర్ణించుకుపోయింది. తద్వారా ఒకే తల్లి పిల్లల మధ్య అవాంఛనీయమైన వైరం బుసలుకొట్టింది. ఎక్కడైతే ఒక జాతి అస్తిత్వం అనుమానంతో చూడబడుతూ అవమానం పొందుతుందో ఆ జాతి మనుగడ కష్టమవుతుంది. ఆ జాతి జనులు ఆత్మన్యూనతా భావనకు లోనై అభద్రతతో బతకాల్సి వుంటుంది. అలాంటి జాతి అభివృద్ధికి ఎప్పుడూ ఆమడ దూరంలోనే వుంటుంది. 1980 సం॥రంలో దేశంలోని ముస్లింల స్థితిగతులపై ఇందిరాగాంధీ వేసిన గోపాల్‌సింగ్ కమిటీ మొదలుకుని నిన్న మొన్నటి సచార్ కమిటీ రిపోర్టు వరకూ ఇదే వాస్తవం కనబడుతోంది.

**ప్ర. ఈ పరిస్థితి మారాలంటే ఏం చేయాలి?**

జ. ఏ జాతి ఉన్నతికైనా అందులోని వ్యక్తుల చైతన్యం ప్రధానం. అందుకోసం నిరంతర కార్యక్రమాలు చిత్తశుద్ధితో జరగాలి. అప్పుడు మాత్రమే వికాసం జరుగుతుంది.

**ప్ర. అందుకోసం మీ వంతు ప్రయత్నంగా ఏం చేస్తున్నారు?**

జ. చేయాల్సినంతా చేస్తున్నా. నిజం చెప్పాలంటే ముందు తరాలవారు సైతం అసలేం చేయకుండా లేరు. వారు చేసినదాని స్ఫూర్తితోనే నా కృషి కొనసాగిస్తున్నాను. రచనా వ్యాసంగం కాక యువతనూ, స్త్రీలనూ జాగృతపరిచేలా వందల సంఖ్యలో ప్రసంగాలు చేస్తున్నా. వీలైనంతమందికి పాజిటివ్‌గా చరిత్రను అందించేందుకు ప్రయత్నిస్తున్నా. ఏదేమైనా నా పాత్ర పరిమితం. నేను చేస్తున్నది స్వల్పం. ఇంకా ఎంతో కృషి జరగాల్సుంది.

**ప్ర. ఈ విషయంలో ముస్లిమ్‌లను మాత్రమే ఎన్నుకుని వారి చరిత్రను పరిశీలించడం సంకుచితత్వం కాదా?**

జ. ఈ రోజు దేశం మొత్తం గర్విస్తోన్న ఝాన్సీలక్ష్మీబాయి కంటే ముందే బ్రిటీష్ సామ్రాజ్యాన్ని తొడగొట్టి సవాల్‌చేసి ఈస్టిండియా దుమ్ముదులుపుతూ ఫెడరల్ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసిన ఏర్పాటు చేసిన అవధ్‌రాణి బేగం హజరత్ మహల్ గురించి ఎంతమందికి తెల్సు? మన్నెం వీరుడు అల్లూరికి ఆయుధాన్ని కాల్చడం నేర్పిన ముస్లిమ్ వీరుడు షేక్ మదీనా సంగతి ఎంతమందికి తెల్సు? దేశం మొత్తాన్నీ

దశాబ్దాలుగా తన స్ఫూర్తితో మేల్కొల్పుతున్న సుభాష్‌చంద్రబోసును నేతాజీ అని పిల్చిందీ, అతి గొప్ప దేశభక్తియుత నినాదంగా మార్మోగుతున్న 'జైహింద్' నినాదాన్ని రూపకల్పన చేసిందీ 'అబిద్ హసన్ సఫ్రానీ' అనే ముస్లిం దేశభక్తుడనే నిజం ఎవరికి తెల్సు? ఈ నిజాల్ని తెలపడం బాధ్యతే కాని పక్షపాతం కాదు. ఇలాగే దళిత బహుజనుల వీరుల చరిత్ర కూడా వెలికి తీయాల్సి ఉంది.

**ప్ర. చివరిగా, మీ లక్ష్యం చెప్పండి?**

జ. జ్ఞానం ప్రజాస్వామీకరించబడినప్పుడే పురోగతి సాధ్యమౌతుంది. లేకపోతే సమాజం అధోగతి పాలవుతుంది. ఈ దేశగడ్డపై నా జాతి జనుల రక్తం చాలానే పారింది. మరుగునపడ్డ ఆ చరిత్రను మానవీయ కోణంలో వెలికితీసి హిందూ-ముస్లిం సామరస్యత కోసం చేసిన కృషిని సాహిత్యరూపంలో అందిస్తూ సమాజ పురోగతికీ దేశ సౌభాగ్యానికీ, తద్వారా జాతి ఉన్నతికీ నా వంతు తోడ్పడడమే నా జీవం, అదే నా లక్ష్యం.



గాంధీస్మారక సమితి వ్యవస్థాపకులు

# ఈదర గోపీచంద్‌గారి

(నర్సారావుపేట) ఇంటర్వ్యూ



**ప్ర. సామాజికోద్యమాల్లోకి ఎలా వచ్చారు?**

జ. నేను పుట్టింది పెనుమాకలో, పెరిగింది నాగాయిలంక గ్రామంలో. అప్పట్లో కృష్ణాజిల్లా స్వాతంత్ర్యోద్యమ చైతన్యానికి పుట్టిల్లు. నా చదువలా తుళ్ళూరు, గుడివాడ, యుద్ధనపూడి, మద్దిపాడు, నూజివీడు, మచిలీపట్నం మొదలగు చోట్ల సాగుతోన్న క్రమంలోనే మా నాన్నగారి అకళంకిత దేశభక్తి ప్రభావం నాపై పడి చిన్నతనంలోనే గాంధేయవాదంపై ఆసక్తీ, సంస్కరణోద్యమాల పట్ల అభిమానం ఏర్పడ్డాయి.

**ప్ర. మీ నాన్నగారు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారా?**

జ. ప్రత్యక్షంగా పోరాటంలో లేరు కానీ పరోక్షంగా సమర్ధించేవారు. నాన్న పేరు రామకోటయ్య, అమ్మ రంగనాయకమ్మ. నాన్న అచ్చమైన ఆస్తికుడు. 'దేవుడున్నాడు' అనే చిన్న పుస్తకాన్ని ఆయనే రాసి ప్రచురించాడు. నేను నాస్తికుడ్నయిన తర్వాత ఆయన్ని ఉడికించడం కోసం 'దేవుడు లేడు' అనే పుస్తకం రాస్తాననేవాణ్ణి. నాన్న ఎంత దైవభక్తుడో అంత దేశభక్తుడు, నిత్య ఖద్దరుధారి. ఆ రోజుల్లో గాంధీగారిపై అభిమానంతో బోయపాటి నాగేశ్వర్రావుగారు స్థాపించిన 'హిందీ ప్రేమీ మండలి' ద్వారా ఆయన హిందీ కష్టపడి నేర్చుకుని హైద్రాబాద్‌లో టీచర్ ట్రైనింగ్ పూర్తిచేసి హిందీ పండిట్‌గా ఉద్యోగం సంపాదించారంటే ఆయన పట్టుదలెలాంటిదో చూడండి.

**ప్ర. మరి, మీరేం ఉద్యోగాలు చేయలేదా?**

జ. ఎల్.ఐ.సి. ఆఫీసరుగా హైద్రాబాదులో ఉద్యోగం చేస్తుండేవాడ్ని. అప్పుడు తెలంగాణా వావిలాల గోపాలకృష్ణయ్యగా పేరొందిన గాంధేయ యోధులు కోదాటి నారాయణరావుగారితో పరిచయం ఏర్పడి నా జీవితాన్ని అర్ధవంతమైన మలుపు

తిప్పింది. 1969లో గాంధీ శతజయంత్సోవాల సందర్భంగా దేశంలోని అన్ని రాష్ట్రాల్లో గాంధేయవాద సిద్ధాంత ప్రచార సంస్థలు ఏర్పడ్డాయి. అందులో భాగంగానే ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారక నిధి ఏర్పడి గాంధీ సాహిత్యాన్ని విస్తృతంగా ప్రచురించడం జరిగింది. ఒకవైపు గాంధేయవాదాన్ని నిలువునా జీర్ణించుకున్న కోదాటిలాటి పెద్దల ప్రభావం, మరోవైపు మనసును విశాలంచేసి మానుష కర్తవ్య బోధచేసే సత్యాగ్రహ సాహితీ ప్రమేయంతో నగరవాసానికి నీళ్ళొదిలి గ్రామసీమలకి పయనమయ్యాను. అలా హైద్రాబాద్ నుంచీ నర్సారావుపేట వచ్చేసాను.

**ప్ర. సన్నిహితులు వొద్దని వారించలేదా?**

జ. పిచ్చివాడ్ని చూసినట్టు చూసారు. ఇతర ఉద్యోగులంతా గ్రామాల్నుంచి నగరానికెగబాకుతూంటే నేనేమో నర్సాపురానికి పట్టుబట్టి ట్రాన్స్‌ఫర్ చేయించుకోడం చర్చనీయమైంది.

**ప్ర. మరిక్కడకొచ్చి ఏం చేశారు?**

జ. చేయగలిగినంతా చేసాను. మురికివాడల్లో రాత్రిబడులు నడిపాను, వయోజన విద్యకోసం పాటుపడ్డాను. ముఖ్యంగా పేదవాడల్లోని స్త్రీలకు చదువు చెప్పే కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించాను. మద్యపాన వ్యతిరేక ప్రచారం, గ్రంథాలయాల స్థాపన మొదలైనవి చేపట్టాను. రాత్రుళ్ళు చదూకోవడం కోసం గ్రామస్తులు నా దగ్గరకొస్తున్నప్పుడు దూరం నుంచి కనిపించే వారి లాంతర్ల వెలుగు అజ్ఞానమనే చీకటిని తరమడానికొస్తున్నట్లూహించుకుని అబ్బురపడేవాడ్ని. ఆ తర్వాత మిత్రుని సలహాతో 1980లో 'చదువు' అనే పత్రికను స్థాపించాను. అప్పుడే నా వివాహం కూడా జరిగింది. తర్వాత పత్రిక పేరును 'చదువుకుందాం'గా మార్చి రిజిష్టరు చేసి అనితరసాధ్యంగా నడిపాను. మొరార్జీదేశాయి ఆధ్వర్యంలో జనతా ప్రభుత్వం తలపెట్టిన వయోజన విద్యా కార్యక్రమ నిర్వహణావర్గం దృష్టిలో నా పత్రిక పడి 4000 కు పైగా సర్క్యులేషన్‌తో నడిచి రాష్ట్రవ్యాప్తంగా ఆరేడు సంవత్సరాలపాటు వో వెలుగు వెలిగింది.

**ప్ర. మరి తర్వాతెందుకు ఆగిపోయింది?**

జ. నా ఆలోచనల్లో వొచ్చిన మార్పులు, అధికారం మారిన పాలకుల అనాసక్తి యిందుక్కారణం.

**ప్ర. గాంధీ స్మారక సమితికి దారి తీసిన పరిస్థితులేవి?**

జ. అశాస్త్రీయ విద్యావిధానాల పై నిరసన క్రమంలో భాగంగా ప్రత్యామ్నాయ గాంధేయవిధానంపై మక్కువతో మా అబ్బాయి చదువుకోసం 'బాపూబాలవిహారం' అనే పాఠశాలను స్థాపించాను. అంతేకాదు, పిల్లలకు సులువుగా అర్థమయ్యే రీతిలో చిన్న చిన్న పద్యాలు, పాటలు, పొడుపుకథలు, సామెతలూ పలుకుబడులతో అందమయిన చిన్న పాఠ్యపుస్తకాన్ని కూడా తయారుచేసాను. సుమారు 10 సం॥రాలు నడిచిన ఆ స్కూలు తర్వాత మూతపడింది. 1985లో గాంధీ స్మారక సమితిని స్థాపించి వివిధ కార్యక్రమాలు చేస్తున్న క్రమంలో 1986 అక్టోబర్ 2న మూడు కోతుల బొమ్మ స్ఫూర్తితో 'అశ్లీలతా దోరణుల వ్యతిరేక వేదిక'ను నర్సారావుపేటలో స్థాపించి ప్రసార మాధ్యమాల అశ్లీలతను వ్యతిరేకించడమే పనిగా చేసాం. ఆ సమయంలోనే 1987లో 'నైతిక విప్లవ'మనే మరో పత్రికను స్థాపించాను.

**ప్ర. సంస్థ తరఫున ఏయే కార్యక్రమాలు చేపట్టారు?**

జ. అనేక కార్యక్రమాలు చేసాం. శ్రోతల కోరిక మేరకు రేడియోల్లో వినిపించే ద్వంద్వార్థ పాటలను నిరసిస్తూ విజయవాడ దూరదర్శన్ కేంద్రం ఎదుట ధర్నా చేసాం. అశ్లీలమైన సినిమా, వాణిజ్య వాల్‌పోస్టర్లను అతికించరాదని ప్రచారం చేసాం. సెన్సార్‌బోర్డు యొక్క బాధ్యతల్ని గుర్తు చేసాం. కామోత్సవ్ అనే బూతు సీరియల్‌ని రాసిన మహారచయిత శేషేంద్రశర్మనూ, మల్లాది నవల ఆధారంగా రూపొందిన తేనెటీగనే సినిమాను కోర్టుకు లాగడంతో ఇటు సాహితీ జగత్తులోనూ, అటు సినీరంగంలోనూ మా సంఘం పేరు సంచలనమైంది. ఆ స్ఫూర్తితోనే రాష్ట్రవ్యాప్తంగా వివిధ ప్రగతిశీల ప్రజాసంఘాలతో చర్చించి కొద్దిపాటి మార్పుతో 1989 ఫిబ్రవరి 26న విజయవాడలో 'అశ్లీలతా ప్రతిఘటనా వేదిక' ఏర్పడి సుమారు 16 మిత్ర సంఘాల్తో విస్తృతంగా పనిచేయడం ప్రారంభించింది.

**ప్ర. ఆ కాలంలో మీరు సాధించిన విజయాలు ఉన్నాయా?**

జ. చాలా. మా నిరసన ప్రభావంతోనే కోటప్పకొండ జాతరలో అశ్లీల నృత్యాల్ని అధికారికంగా నిషేధించారు. గోరాగారి కుమారుడూ, ప్రఖ్యాత వైద్యుడైన సమరం రాసిన ఎక్స్‌క్లినిక్ అనే బూతునవల విషయంలో పెద్ద ఎత్తున పోరాటం చేసి

నాస్తిక కేంద్రం ముక్కు నేలకు రాయించాం. తమ్ముడి సిగ్గుమాలిన రాతలను సమర్ధించాలని శతవిధాల చూసిన లవణంగారికి సైతం బుద్దొచ్చేలా చేసాం. ప్రజాసంఘాల నిలదీతకు నాస్తిక కేంద్రం నీళ్ళు నమలక తప్పలేదు. ఆ గొడవంతా 'సమరంపై యుద్ధం' అనే పుస్తకంగా వచ్చింది. అలాగే శ్రీలక్ష్మి హత్యానంతరం యుద్ధప్రాతిపదికన 12 జిల్లాలు పర్యటించి ఆ రోజును ర్యాగింగ్ వ్యతిరేక దినంగా పెట్టమని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసాం. అనేక విద్యాసంస్థలైతే స్వచ్ఛందంగానే అందుకోసం సిద్ధపడ్డాయి కూడా. అలాగే లైబ్రరీల్లో కొన్ని అశ్లీల గ్రంథాల నిషేధాన్ని తీసుకొచ్చేలా చేసాం. అందాల పోటీల్ని వ్యతిరేకిస్తూ ప్రదర్శనలు జరిపాం. మద్యానికి వ్యతిరేకంగా 'మద్య వ్యతిరేక ఐక్యవేదిక'ను ఏర్పర్చి మత్తును విడనాడే విధంగా చైతన్యాన్ని తీసుకొచ్చే యత్నం చేస్తున్నాం. 'మంచి చిత్రాల అభిమానం సంఘం' (ఫెయిర్ ఫిలిమ్స్ ఫేన్స్ అసోసియేషన్ (ఎఫ్.ఎఫ్.ఎఫ్.ఎ) ను స్థాపించి మంచి సినిమాల్ని ప్రోత్సహించే నిమిత్తం ప్రచారం చేస్తున్నాం. మీడియా వాచ్ అనే సంస్థను నడుపుతున్నాం. ఈ మధ్యే సేంద్రియ వ్యవసాయం, సహజసిద్ధ ప్రాకృతిక జీవన విధానంపై అవగాహన పెంచుతున్నాం.

**ప్ర. ఈ క్రమంలో మీకెదురైన ఆటంకాలేవైనా ఉన్నాయా?**

జ. మొదట్లో బెదిరింపులొచ్చేవి, తర్వాత లేవు. పోస్టర్లు చింపించి వేస్తున్నప్పుడు సినిమాహాళ్ళవాళ్ళు బెదిరించేవారు. ఒకసారి 'నైతిక విప్లవం'లో మద్య నిషేధం తొలగించినందుకు చంద్రబాబునాయుడ్నీ, మా ప్రాంత నాయకుడు కోడెలని ఘాటుగా విమర్శిస్తూ రాసాను. అప్పుడే మునిసిపల్ ఆఫీసు వద్ద నాపై దాడి జరిగింది. అంతు చూస్తామని బెదిరించారు. అయినా నేనేం బెదర్లేదు. నైతిక విప్లవం దాదాపిరవై రెండు సంవత్సరాలు నడిచింది. ఆ తర్వాత సినీ పరిశ్రమకు విజ్ఞప్తి, మీడియాకు ముకుతాడు, గాంధీ జీవితం - సందేశం వంటి రచనలు చేసాను. ఇక మా ఉద్యమాన్ని ఎగతాళి చేసినవారూ లేకపోలేదు, కొద్దిమంది గాంధేయవాదులు మొదలు సుప్రసిద్ధ హేతువాద నాయకలు మాపై దాడిచేస్తూ రచనలు కూడా చేసారు. ఏ ఉద్యమానికైనా ఇవన్నీ మామూలే.

**ప్ర. స్త్రీల వస్త్రాధారణపట్లే దృష్టి సారించిన అశ్లీల ప్రతిఘటనోద్యమం, పురుషుల నగ్నదేహాలు ప్రదర్శించడం సబబే అనుకుంటోందా?**

జ. లేదు, నా దృష్టిలో సభ్యతగాలేని శరీర ప్రదర్శన అదెవరిదైనా అశ్లీలతకు మినహాయింపు కాదు.

**ప్ర. మరలాంటప్పుడు సినిమా - వ్యాపార ప్రకటనల్లో స్త్రీ శరీరానికిస్తున్న ఉద్యమ ప్రాధాన్యత అర్హత పురుషులకివ్వటం లేదెందుకని? ఇది పురుషాధిపత్యంతో కూడిన సంకుచితత్వం కాదా?**

జ. నిజమే. ఈ విషయం మేమూ పునరాలోచించుకోవాలి.

**ప్ర. చివరగా, ఈనాటి సమాజంలో మీ ఉద్యమవసరం ఏంటో చెప్పండి?**

జ. ప్రపంచీకరణ ప్రభావంతో వినాశనం దిశగా పరుగులు తీస్తున్న వర్తమాన వ్యవస్థలో ఈ ఉద్యమావసరం మరింత వుంది. ఐతే, యువత, విద్యార్థుల్లో ఈ దిశగా భావోద్యమ ప్రచారం విరివిగా చేయలేకపోవడం మా ప్రధాన లోపం. ఆ దిశగా కృషి జరగాలి. మహాత్మాగాంధీ ఆశయాలతో మానవీయ మార్గాన్ననుసరించి ముందుకెళ్ళడమే ఈనాటి సమాజ అభ్యున్నతికి మిగిలున్న ఏకైక మార్గం.

